శ్రీ

# దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారి యాంధ్ర-లక్ష్మీశృంగారకుసుమమంజరీ విమర్శము.

ఓరుగంటి వేంకటేశ్వరశర్మ, దర్శనశాస్త్రి,
హిందీపండితుఁడు, ఆంధ్రవిశ్వకళాపరిషత్కళాశాల.



చెన్నపురి:
'శ్రీ రామ' ప్రెస్సున
ముద్రితము.
1936

'శ్రీగురుచరణస్మరణమ్
సంసృతి తపభిన్న చంద్రమః కిరణమ్
మదుపర్యవిరళకరుణం
విస్మృతనిజరూపదర్పణం కలయే.'

శ్రీగురుచరణములకు
దీ ను ని
సేవాంజలి.

# విజ్ఞాపనము.

"యత్రోర్ధ్వనం ద్వైతవనమ్ మృత్యు రేవ మహాపశుః,
అలౌకికేన యజ్ఞేన తేన నిత్యం యజామహే.

నిఖిలలోకములు మహాశక్తిమాయోల్లసితములు. శాక్తేయులమతమున సృష్ట్యాదిక్రమమున కంతయు శక్తి శక్తిమంతులరమణమే కారణము. శక్తిమంతుఁడగు పరాత్పరునికి సృజియించుకోర్కె యుదయింపనిచో జగద్విలసనమే యుండదు. అతని శాసిస్పృహ జనియించుటయు నౌపచారికము. శాక్తేయు లర్ధనారీశ్వరునియందు నారికి - శక్తికి - ప్రాధాన్యమొసంగి యామెనే వేర్వేఱుమార్గముల స్తుతియించి యున్నారు. అట్టి స్తవములలో సౌందర్యలహరియు, లక్ష్మీశృంగారకుసుమమంజరియు పేర్కొనందగినవి.

లక్ష్మీ శృంగార కుసుమమంజరి శాక్తాగమపయఃపూరనవనీతము, పరిపూర్ణానందనాథమథితోద్ధృతము. ఇది లక్ష్మీపారమ్యతత్పరము. ఈపరదేవతాస్తుతి మకరందపేశలతచే లక్ష్మీశృంగారకుసుమమంజరియే యైనది. భగవతీపదాంభోజప్రోద్యన్మధురసఝురాంతర్వాహతచే సత్పురుషులకు మూర్ధమున నెలకొలుపందగినది. రచయిత చెప్పినటుల,-



'శ్రీదేవతాస్తుతి[illegible]ర్యాం శ్రితభక్తిభావా
గాయంతి యే ప్ర[illegible]దార్థరసజ్ఞశీలాః,
[illegible]దంతి పి[illegible]పదం పరదేవతాయాః
[illegible]లపుణ్యనిదర్శనం తే.'

అని ఇది. ప్రతిపదమునను రసము చిప్పిలుచుండును, ప్రతిమాటయు రసభూయిష్ఠము.

ఇట్టి యీయుత్తమకావ్యమును శ్రీదుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు నిజాంధ్రానువాదసమేతముగా చిరకాలమునాఁడు సంగ్రంథించిరి. వారిమతమున వారియనువాదము యథామాతృకమైనను,నతిమాతృకమైననుఁ గానోపును. లేదేని తమపద్యముల కెదురెదురుగ మూలమును ముద్రింపించియుందురా? కాన పాఠకులు నట్టే రెంటిని సరిపోల్చి చదువుట ధర్మము.

శర్మగారి యాంధ్రీకరణగుణాగుణపరీక్షకు పూర్వము నేఁటియాంధ్రీకరణమార్గములఁగూర్చి యొకమాట. ఏకాలమునను గొప్పపండితులుగాని, అట్లే ఉత్తమకవులుగాని యరుదుగ నుందురు. ఈకాలమున మఱియు. పాణిని వ్యాకరణము ననుశాసించుటయు, వాల్మీకి రామాయణముం బాడుటయు, తిక్కన పోతనలు భారతభాగవతములం గురియుటయు, ఇట్టివెల్ల అట్లట్లు వారి ప్రతిభ[illegible]నకును ఆనందమునకు ప్రాయికముగను పరీవాహముగా పొరలుటయే. నేఁటికవుల కట్టి[illegible]ని[illegible]త్యాద్యానందములఁగూర్చుశక్తి యున్నాప్పు, [illegible] తమనమ్మని వ్రాఁతను, తమయెఱుఁగనివిష

యమును, ఎరవువాక్కులఁ గవిత్వము పేరం బ్రకటించుకొను వారు గలరు కవితాదిశిల్పములం దట్టిదోషములు దండనీయములని యార్యులందురు. ఇఁక దుర్భావము నిర్భావము నిరర్థము అనర్థము, నీరసము విరసమునైన కావ్యమన్ననో సర్వథా పరిహరింపఁదగినది.

నేఁటికవులు ప్రాఁతప్రబంధమార్గమున నడుచువారును క్రొత్త 'భావకావ్యాది'మార్గమున నడుచువారును నై యిరు తెఱంగుల నున్నారు. తిక్కన పెద్దనాద్యపేక్షచే పూర్వులును, వర్డ్స్వర్తు కీట్సు షెల్ల్యాద్యపేక్షచే నుత్తరులును ప్రాయికముగ నుభయులును సూర్యునియెదుటి మిడుంగుఱులే. మఱియు అనువాద మొక తెఱఁగుకావ్యము; సొంతకల్పన యొండొక తెఱఁగుది. ఇట ననువాదము ప్రకృతము. సంస్కృతమూలము ననువదించు తెలుఁగుకవి యెట్టివాఁడు కాఁదగును? ఆయనువాద మెట్టిది కాదగును? అనువాదకుఁడు మూలకవి హృదయమును, అద్దములోని బొమ్మనుంబోలె స్పష్టముగా సాక్షాత్కరించుకొన్నవాఁడును, మూలమును సొంతముగా లెస్సగా నెఱింగినవాఁడును, అందలి శబ్దార్థగుణాలంకార రసాదిసర్వస్వమును తనబుద్ధిచే నిర్వికల్పముగా గ్రహించిన వాఁడును, స్వతంత్రుఁడుగను ఉండవలయును.

ఆతనికావ్యమును నతని రసాభినివేశమును చాటునదియు, అతని ప్రతిభను పొరలించునదియు నగును. అట్లుగాక, ఆకవి మూలమును తెలియనేరక టీకాదిపరతంత్రుఁడై,

తనబుద్ధిని పరాయత్తముచేసిన, అతనికావ్యమతనియవ్యుత్ప న్నతను అశక్తిని చాటుచుండును.

నేఁటియనువాదకులం దనేకు లట్టివారే. తమశక్తి చాలమిని తామెఱింగియు లోకమున గొప్పకవుల మనిపించు కొనఁ దలంపుఁబూని పెద్దల నిందించుచు, తమకావ్యము లాపెద్దలకావ్యములవలె మక్కికిమక్కి యనువాదములు గావనియు, తమవి స్వతంత్రానువాదములనియు వాకొనుచు శ్రీనాథునివచనముల నస్థానమున నసంపూర్ణముగ నుద్ధరించుచు లోకమును బేలుపుచ్చుచుందురు. శ్రీనాథుఁడు "అశేషమనీషి హృదయంగమంబుగా శబ్దం బనుసరించియు నభిప్రాయంబు గుఱించియు, భావం బుపలక్షించియు, రసంబుపోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు, మాతృకానుసారముగ" కవిత యల్లెను. ఈవాక్యముచే శ్రీనాథుఁడు అనుకర్తయయ్యు స్వతంత్రుఁడే అని గోచరించును; గాని ఈస్వాతంత్ర్యము అనుకర్తకు మూలమునకు మెఱుఁగుబెట్టుటకేగాని పాడు చేయుటకుఁ గాదని స్పష్టము. మఱి నేఁటి యనువాదకులు అర్థమేల, శబ్దమేల, అలంకారమేల, మఱియే రసమేనియేల? మేము స్వతంత్రానువాదకుల మనుచు వాకొనుచుండ కవిత్వము శుష్కించి తేలికపడి మనుగడకై టక్కరితనము నాశ్రయించి వేసములచే లోకమును వంచించుచున్నది.

ఇఁక ప్రకృతానువాదము విషయము. ఇది స్వతంత్రానువాదముగ నుద్దిష్టముకాదని ప్రక్కప్రక్కన మాతృకాపుత్త్రిక

లను బ్రకటించుటచే తేటపడుచున్నది. శర్మగారు పద్యములను చక్కఁగ నల్లఁగలరనుట కెట్టిసందేహమును లేదు. వారిరచన యం దేదేనిగుణలవముండిన, వారి కవితయం దేదేని చిత్తము ముచ్చిలు శక్తియుండిన, అది వారిధారాశుద్ధియే. వారికవిత చెవికెక్కును. అంతియ. అదికాకలియే. కాని యొకింత నిల్చి దానియందలిభావ మేమియో, కవియాశయము శబ్దమాధుర్యసమముగ నుండునేమో అని పరికించిన ఎంతయేని కొఱంత కల్గకపోదు. ఆంధ్రలక్ష్మీశృంగారకుసుమమంజరి యాంధ్రీకరణమనియు, నందు తాంత్రికులమతముబడి శ్రీదేవతాస్తుతిగలదనియు, నది యొకసాధనాప్రకారమును నిర్వచించు పరమమార్గోపదేశిక యనియు, గ్రంథము దేవికి భక్తుఁ డొసంగిన ప్రసాధనావిశేషమనియు విస్మరించి, కావ్యాత్మ కేవలధారాశుద్ధియే ("రన్ను!") శ్రవణసుభగతయే, (చెవికెక్కుటయే, చిత్తమున కెక్కుటకాదు!) యని రాద్ధాంతీకరించుకొనినచో నీయాంధ్రీకరణము తద్రచయితకు కీర్తికరముగ నుండెడిదే. కాని పై వానిని మఱచుటకు వీలుకాదుగదా? శ్రవణసుభగత పెక్కుకావ్యగుణములలో నొకటియే. అదియే కావ్యగ్రాహ్యతా గ్రాహ్యతలనిర్ణయించునికషము కానేరదు. దానికలిమిచే కావ్యగుణ మొకింత హెచ్చును. అదిలేక యొకింత తగ్గును. అంతియ. రసమే కావ్యమునకాత్మ. ఔచిత్యమే రసపోషణైకసాధనము. ఈరెంటిని ధ్యానమందుంచుకొని యాంధ్రీకరణముం జదివిన, బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారి

యాంధ్ర ప్రసన్న రాఘవవిమర్శన పీఠికయందలి యీక్రింది వాక్యములు స్మరణకు రాకమానవు,—

'కతిపయపదములకు సజీవనిర్జీవసాధనములచే నర్థమెఱుంగుట గ్రంథార్థ మెఱుంగుటకాదు. గ్రంథార్థములో నన్నిపదార్థముల యర్థము, వాక్యముల యర్థము, కథాసందర్భము, రసంబునుంగూడఁ జేరును. వీనినెల్ల మాని దానిని మాత్రము పూనిచేసిన తెనింగింపునకు మూలగ్రంథనామ మిడుట సరికాదు." అని.

తమ విజ్ఞాపనమున నేనియు శర్మగారు తాము భాషాంతరీకరణమునకు నిశ్చయించుకొనిన ప్రకారముంగూర్చి తడవియుందురేమో యనునాశతో పరికించిన నిరాశపాలు గావలసివచ్చును. అందు ఎట్టులో పదియాఱేండ్లకుపూర్వము పూనియు నీలఘుకృతిఁ హాళిఁ తెనింగింప నిర్వాదియేఁడులు పట్టెననియు, (ఏమి యీలెక్క!), తమగ్రంథమును ప్రకటించునానాఁటికి ద్యుతియు మనీషయుఁ దఱుఁగుచుండెననియు, అభీష్టగురుప్రబంధనిర్మితి (ఏప్రబంధమో అది?) కొనసాగునో లేదో యనువారి సందియమును, నిట్టివ మఱికొన్నియుం ద్రిక్క గ్రంథవిషయమును లవమేనియుఁ దడవినవారు కారు.

శర్మగారికృతిని విమర్శించుటకుఁ బూర్వము మూలముంగూర్చి యొకమాట. రచయిత తనమంజరి నైదుకుసుమములఁ

గూర్చెను. అవి విజ్ఞాపనాధ్యానవర్ణనావిర్భావపూజాకుసుమ
ములు. అందు విజ్ఞాపనాకుసుమాంధ్రీకరణమును గూర్చియే
ప్రకృతము నావిమర్శ. దేవిభక్తుల కెచ్చరిక సేయుభారమును
దాననే తీరునని నాయాశయము. కడమ గ్రంథము కాలాంత
రమున పాఠకులకరము లలంకరింపఁగలదు. విజ్ఞాపనాకుసుమ
మున సంక్షేపముగ శాక్తేయమతము వర్ణితము. దేవి నెట్లుపా
సింపవలయునను జిజ్ఞాసపొడముటకు ముందే దేవీస్వరూపమహి
మల కొలఁదిగ వర్ణించి, రెండవకుసుమమున దేవిం గూర్చిన
ధ్యానమును, మూఁడవదానియందా దేవి యావిర్భావమును,
నాలవదాన నావిర్భవించిన దేవివర్ణనమును, నైదవకుసుమమున
నుపాసకుని పూజయు నభివర్ణితములు. గ్రంథమునందు వస్త్వై
క్యము గలదు. అది మహాలక్ష్మి యుపాసనయే. ఇట్టి యీగ్రం
థమునకు మూలకందము, బీజభూతము విజ్ఞాపనాకుసుమమే.

అందు పరిపూర్ణుఁడు సంక్షేపముగ శాక్తాగమసిద్ధాంత
ములను తడవియున్నాఁడు. ఈశుని జగత్క్రీడాదియు, దేవీ
పరిణామప్రకారమును, క్షేత్రజ్ఞునిపశుభావ ముక్త్యుపాయ
ములును, దేవీమాహాత్మ్యమును, ఆమె భగవతీత్వమును,
భక్తుని విజ్ఞాపనమును, దేవీకటాక్షప్రక్షేపమును, తత్ఫలిత
ముగ నుపాసకునికి స్వాత్మసాక్షాత్కారానందప్రాప్తియును—
అభివర్ణితములు.

ఇట్టి గ్రంథము నాంధ్రీకరింపఁ గైకొన్నందులకు శర్మ
గా రెంత స్తుత్యులైనను, వీరిసాహిత్యమునకు తలపాలమైన
యీయనువాదము, శాక్తాగమానభిజ్ఞత చేతను, మూలము

నర్థము చేసికొనుటకు వలసినసంస్కృతము తెలియమి చేతను, రసజ్ఞత లేమి చేతను, ఔచిత్యముల గుర్తెఱుంగలేకపోవుట చేతను, కరము చెడినది. ఎవరు తెలియక దీనిని దేవిపూజకు చేకొని తాము మైలపడి దేవిని మైలపఱతురో యని బెగడొంది మెలకువ చెంది, దోషము చాటి, దీనిని యథావిధిని పరిహరించి దేవిని సేవించుటకై ఈవిమర్శమునకుఁ బూనినాఁడను. నాయభినివేశనిర్వాహముల సాధుతాసాధుతలకు దేవిభక్తులే ప్రమాణము.

'ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్.'

ఆంధ్రవిశ్వకళాపరిషత్కళాశాల,<br>వాల్తేరు, 4-8-36. } ఓరుగంటి వేంకటేశ్వరశర్మ.

శ్రీ

# దుర్భా సుబ్రహ్మణ్యశర్మ గారి
# యాంధ్ర-లక్ష్మీశృంగారకుసుమమంజరీ
# విమర్శము.

---

## I

ఆ. అమృతసరస్వదంతరవటాగపలాశపుటమ్మునన్ జగ
త్క్రమరచనాదిచే నలసి కమ్ముఁ బరున్నవిభున్ విలోచనాం
తముల స్పృశించుచున్ స్వలలితమ్ములనెవ్వతె ప్రీతుఁ జేయున
య్యమలిన యోగనిద్రభవహారవినిద్ర సమాశ్రయించెదన్.

మూ. సుధాసింధోరంతర్వటవిటపినః పల్లవపుటే
జగత్క్రీడాయాసాలసమనసమీశం సుశయితమ్,
దృగంతే చుంబంతీం రహసి సుఖయంతీం స్వలలితైః
భజే సంవిన్నిద్రాం భవహృతివినిద్రాం భగవతీమ్.

తా. జగద్రచనారూపమగు క్రీడచే నలసిన మనస్సు కలవాఁడై అమృతసముద్రమధ్యమున వటపల్లవమున శోభావహముగ మేనుఁజేర్చిన యీశుని దృగంతముల నేకాంతమున ముద్దిడుకొనుచు, నాతని తనలలితములచే సుఖింజేయుచు, దేవి భవోచ్ఛిత్తియందు జాగరూకయై సంవిన్ని

ద్రాస్వరూపిణియై యుండుననియు నట్టి భగవతిని సేవించు చున్నాననియు శ్లోకతాత్పర్యము.

ప్రా. 1. క్రమ, 2 అమలిన.

3. జగత్క్రమరచనాదిచే 'జగత్క్రీడాయాస' రచయితయుద్దేశ్యము. క్రమరచనంగూర్చి చెప్పుటకాదు. జగత్సృష్టిస్థితిసంహారములు పరమేశుని క్రీడామాత్రములని చెప్పుటయే ప్రధానము. శాక్తేయులమతమును, సృష్ట్యాదికమునీశుఁడవలీలగ నొనరించె ననియే. పరాత్రింశికయం దభినవగుప్తులును 'ఇయతా...సృష్టిక్రమేణ...స్వవిమర్శానందాత్మనా క్రీడనేన' (స్వవిమర్శానందాత్మకమును, క్రీడనము నగు సృష్టిక్రమముచే)

"భైరవనాథస్యైవ దేవత్వ మిష్యతే, తచ్ఛక్తే రేవ భగవత్యా దేవీరూపతా. యదుక్తమ్ 'దివు క్రీడా విజిగీషా వ్యవహారద్యుతిస్తుతి గతిషు,"

(భైరవనాథుఁడే దేవుఁడు. అతనిశక్తి యగు భగవతికే దేవీరూపత చెప్పిరిగదా. 'దివు' అను ధాతువు క్రీడాదికమునందు వర్తించుననని)

యోగరాజాచార్యులును,—"ఏషా మాయా దేవస్య క్రీడాశీలస్య సంబంధినీ-ఇతి కృత్వా 'దేవీ' "(-ఈమాయ క్రీడాశీలుఁ డగుదేవునికి సంబంధించిన దగుటచేతనే 'దేవి' యైనది.) పరమార్థసారమున,—'ఇతి బన్ధమోక్షచిత్రాం క్రీడాం ప్రతనోతి పరమశివః',(భగవానుఁడు సంసారాపవర్గస్వరూపమును, చిత్రము నగు క్రీడను విస్తరింపఁజేయును.)

ఇట్టి శాక్తసిద్ధాంతసూచకమగు "క్రీడా" శబ్దమునకు 'జగత్క్రియరచన' అనునాంధ్రీకరణము మూలార్థభంజకము. మొదటిపద్యములోనే శాక్తేయమతప్రాణసారగుళికయగు శబ్దము నిర్మూలింపఁబడినది.

4. 'అలసికమ్మఁ బరున్నవిభుఁ' 'అలసమనసమీశంసు శయితమ్.' క్రీడచే నొకించుక మనస్సుబడల సేదదీర్చుకొనుట కుంబలె నీశుఁడు పాన్పుపై మేను వాల్చెను. అనువాదకులు 'క్రీడను' వదలిరిగాన మనఃక్లేశమును వదలిరి. శరీరమే యలసినది కాన 'అలసి' అని 'అలస మనసమ్, అనుమూలము ననువదించిరి.

5 'పలాశపుటమ్మునఁ' పల్లవపుటే' పలాశమన ఆకు. పల్లవపుటమన చిగురుటాకు. పద్యమున రసము సంభోగశృంగారము. రసపోషణకు వలయు కిసలయతల్పము, దృగంతచుంబనము, నాయికస్వలలితమ్ముల నాయకుని సుఖంజేయుటయు వర్ణితములు. ఇట్లే రసస్ఫూర్తి వలసినపుడెల్ల పాన్పును పూఁబాన్పగనో, చివురుటాకులసెజ్జగనో వర్ణించుట కవిసమయము.

'కిసలయశయన తలే కురు కామిని చరణనళినవినివేశమ్.'

'కిసలయశయననివేశితయాచిరమురసి మమైవ శయానమ్,'

ఇత్యాది. ఇట్లు చివురుటాకు పాన్పుపై నీశుఁడు మనఃక్లేశము వాయ మేనుచేర్చుటయందు శృంగారమును పల్లవింపఁజేయు 'పల్లవమును' మొదలంట గిల్లి 'పుటము' వేయుటతో స్వారస్య మిగిరిపోయినది. మూలమునకును ఆంధ్రీకరణమునకును మృదుపల్లవమునకును, బిరుసుముదిరిన ముదియాకునకును గలభేదము!

6. 'స్పృశించుచుణ్.' 'చుంబంతీమ్,'. ముద్దిడికొను చున్నదని మూలము. తాకుచున్నదని యనువాదకులు. చుంబించుటకుమాఱు స్పృశించి యూరకుండుట రసికచర్య యగునా? దృగంతముల తాకుచున్నదనుటలో భావమేమి? నేత్రములును చుంబనస్థానములలో నొకటి యని వాత్స్యాయనుఁడు.'లలాటాలక కపోలనయన వక్షః స్తనోష్ఠాంతర్ముఖేషు చుంబనమ్' 372 సూ. వాత్స్యాయనునికామసూత్రము.

7. 'రహసి' నాయికానాయక కేళివిషయముగాన రచయిత వారిర్వురకు 'రహసి' ఏకాంతము నొనఁగూర్చిరి. కాని దేవి శృంగారము ననువాదకులు 'రహసి' వదలి రచ్చకీడ్చినారు. ఏకాంతము, 'రహసి' వారికి కిట్టదు. కాననే 'చుంబించుచున్నదనుటకు' 'స్పృశించుచుణ్' అని యనువదించుట.

8 'అమలినయోగనిద్ర' 'అమలిన' యనునది యమూలకము యోగనిద్ర మాలిన్యయుక్తమని యేజడుఁడు తలంచును. ప్రాసకొఱకు 'అమలిన' యను నిరర్థకమగు విశేషణము ను ప్రయోగించు టేల?

9. 'భగవతీమ్' శాక్తేయులు తమయుపాస్యదేవత కొసంగిన ఈనామమును సార్థకమును అనువాదమునపట్టుపట్టి వీరు వదలిరి. గ్రంథమునందంతయు నెచ్చటెచ్చట 'భగవతి' యను శబ్దమును రచయిత ప్రయోగించియున్నాఁడో అచ్చటచ్చట ఆంధ్రీకర్త యామాటను విడనాడియున్నారు. వారిమతమున 'భగవతి' యనుశబ్ద మశ్లీలతాస్ఫోరకము గావలయు. లేనిచో శాక్తేయు లద్దదున ప్రయోగించు 'భగవతి' యనుపదమును

వీరొక్కమాత్రైన ప్రయోగింపకుందురా ? వీరిమతముబడి భగవానుఁడు, భగవద్గీత, భాగవతము మొదలగున వన్నియు వర్జ్యములే. భగవతీశబ్దార్థమును పెద్ద లిట్లు నిర్వచించి యున్నారు.—

"ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః
జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీఙ్గనా,
ఇత్యుక్తలక్షణం షడైశ్వర్యమస్త్యస్యేతి భగవతీ"

(సమగ్రమగు ఐశ్వర్యము వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము, అనునీయారింటికి భగమని పేరు. ఇట్టి షడ్గుణములు కలది భగవతి.)

ఇట్లాంధ్రీకరణమున శాక్తేయమతావలంబు లెంతయేని ప్రేమతోడను, విశ్వాసముతోడను ప్రయోగించు క్రీడ, భగవతి యనుశబ్దములు లోపించినవి. ఆంధ్రశృంగారకృతియందు తొల్తనే శృంగారప్రాణసారములగు చిగురులసెజ్జ, ఏకాంతము, చుంబనమును లోపించినవి. దేవిశృంగారము బూదిలోఁ గలసినది.

## II

ఆ. త్రివిధంబై శతరూపమై వివిధమై క్రీడార్థమురీవ్యస్థలిఁ
భవదీయాకృతి పెక్కుచందముల సేవ్యంబయ్యె, నట్లైన నిఁ
సువివేకుల్ పరికింత్రుతత్త్వమొకడంచుఁ ద్వత్ప్రసాదాఢ్యులై
యవివేకుల్ చకితాత్ములై చెదుదురియ్యర్థంబుశంకించుచున్.

మూ. త్రిధా భిన్నా పూర్వం తదను శతరూపాథబహుధా
జగత్యాం క్రీడార్థం జనని తవ మూర్తిః పరిణతా,
తథాప్యేకం తత్త్వం భవదరుణపాదానుసరణైః
విదుః పూతాస్త్వన్యే చకితహృదయాస్తర్కితభిదాః.

తా. తల్లీ! నీమూర్తి తొల్త త్రివిధముల, పిదప శత విధముల, వెన్క బహువిధముల క్రీడకై పరిణమించినది. అట్లైనను నీయరుణపాదానుసరణమున పవిత్రులగునుపాస కులు తత్త్వ మొక్కటియే యని తెలియుదురు. ఇతరులు, చకిత హృదయులు, భేదములు శంకించినవా రగుదురు.

ప్రా. 1. అవివేకుల్. పా. పూ. 2. వెక్కుచందముల.

3. త్రివిధంబై, శతరూపమై, వివిధమై, మూ. త్రిధా భిన్నా పూర్వం, తదను శతరూపా, అథబహుధా.

మూలమున కంఠోక్తముగ దేవియాకృతులపరిణామ మునం దొక క్రమము తెలియుచున్నది. ఆక్రమము అనువాద మున తెలియుటలేదు. రచయిత 'పూర్వం' 'తదను' 'అథ'- తొల్త, పిదప, అనంతరము, అనుశబ్దములచే ఆక్రమమును స్పష్టముగ సూచించియున్నాఁడు. ఆపదముల యభావముచే నాంధ్రీకరణమున వివక్షితమగుక్రమము లోపించినది. రచ యితయభిప్రాయము పరాశక్తి యీశునిసృష్ట్యనంతరము పరి ణామములఁ గాంచినదనియు, వానియందును నొకక్రమము గలదనియు చెప్పుటయే. తొలిశ్లోకమున ఈశునిక్రీడాయా సాలసమనస్కత చెప్పంబడినది. భగవతి యీశునిదృగంత ములను చుంబనములచేఁ గప్పుచునే భవోచ్ఛిత్తియందు జాగ రూకయనియు నుక్తము. ఇట భగవతికిని జగత్క్రీడ కల దనియు, ఆమె తత్క్రీడార్థము వేవిధముల పరిణమించుచుండు ననియు యీశునిసృష్ట్యాదికర్తృత్వము ఔపచారికమనియు సూచితము.

తొల్త పరాశక్తిరూపమున నీశునికంటె నభిన్నయై, యతనియందు సంవిద్రూపమున లీనయై, తనలలితములచే నాతని సుఖింపఁ జేయుచుండిన దేవియే లోకముల సృజియింప నతఁడు తలంపఁగనే తొల్త మువ్విధముల పరిణమించి, పిదప శతరూపములనయి, పిమ్మట ననేకవిధములైనది అని పరిణామమునుఁ జెప్పుశ్లోక మియ్యది. అట్లే రచయితయే వేఱొకచోట.

"శివాకారా నీలోత్పలసదృశదేహా ప్రథమతః
సురాణా భీతాంస్త్రాతుం హరమనసి మోహం జనయసి;
సుధాధారాదర్పం పరిహరసి భాషాకృతిధరా
సువర్ణాభా దీనా నవసి శిశిరాపాంగనికరైః"

మహాలక్ష్మి మొదట శివగ, పిదప సరస్వతిగ, పిదప లక్ష్మిగ నయి నదియే అని యీయాపరిణామములయందొక క్రమమును 'ప్రథమతః' అనుపదముచే సూచించినాఁడు. లక్ష్మీతంత్రమును దీనినే కంఠోక్తముగఁ జెప్పియున్నది. ఇట్లు పరిణమించిన పార్వతియు, లక్ష్మియు శక్తిమంతులతో కూడుకొని పార్వతీపరమేశ్వరులు, లక్ష్మీనారాయణులు నైనారు. ఇట్లు తొల్దొల్త నేర్పడిన త్రితయమునే అనేకులు జ్ఞానేచ్ఛాక్రియలు; మహాసరస్వతీ మహాకాళీ మహాలక్ష్ములు; వామాజ్యేష్ఠాతిరౌద్రులు; పశ్యన్తీమధ్యమావైఖరులు; అంబికా శాంతాపరలు; ఇట్లే యనేకవిధముల బేర్కొనియున్నారు. ఇది తొలియుల్లాసము. పిదప గౌర్యంశము లేఁబదియు లక్ష్మ్యంశము లేఁబదియు నిట్లు శతరూపములుగ పరిణమించినవి. వానినే పంచాశద్రుద్రశక్తులనియు, పంచాశద్విష్ణుశక్తులనియు నందురు. అట్లే వైఖరియు

ననులోమ ప్రతిలోమ క్రమములచే శతరూపములుగ, (అనులోమ క్రమమున నేఁబదియక్కరములు, ప్రతిలోమమున నేఁబదియక్కరములు) పరిణమించినది. పిదప శక్తిరూపములసంఖ్యాకము లైనవి. ఈయది శాక్తేయులమతమున మహాలక్ష్మీపరిణామ క్రమము. అనువాదకు లొక్కకలవుపాటుతో శాక్తేయమతసిద్ధాంతమగు పరిణామ క్రమమును పోఁగొట్టిరి. కంఠోక్తముగఁ జెప్పఁబడియున్న క్రమమును గ్రహింపలేక పోయినారు.

4. ఉర్వీస్థలిగా మూ. జగత్యాం. జగచ్ఛబ్దము గమనశీలమనునర్థమును తోఁపింపఁజేయును. దేవిపరిణామములతోడ జగమును పరిణమించుచుండునని ధ్వని. 'ఉర్వీస్థలిగా' అనుటచే 'జగత్' అనుశబ్దమునందలి యాచితి చితిపాలైనది. 'జగత్యాం' అనుటచే నిఖిలభువనములు స్ఫురించుచుండ 'ఉర్వీస్థలిగా' అని భూలోకముననే దేవి సేవ్య యని యనువదించుటయందు హృదయమేమి? పృథ్వీతరముల శక్తి యుపాస్య యని ఎవ్వరు చెప్పఁగల రనియా?

5. భవదీయాకృతి... సేవ్యంబయ్యె... మూ. మూర్తిః పరిణతా. ఇందు 'పరిణతా' యనుటకు 'సేవ్యంబు' అనునది 'పరిణామ' శబ్దార్థము నెఱుంగమిచేతనే. రెండుమాటలకును భేదమెంతయేని గలదు. పరిణామము భేదాభేదములను తెల్పుపారిభాషికశబ్దము. పరిణామమునకు చక్కని యుదాహరణము,—

'రసఫాణితశర్కరికా గుడఖండాద్యా యథేక్షురస ఏవ తద్వదవస్థాభేదాః సర్వే పరమాత్మనః శంభోః'.

(రసము, ఫాణితము, చక్కెర, బెల్లము, కలకండ మొదలగునవన్నియు ఎట్లు చెఱకురసవికారములో అట్లే యన్నియు పరమాత్మయగు శంభువుయొక్క యవస్థా భేదములే; పైఁజెప్పినవన్నియు నన్యోన్యము భిన్నములయ్యెను, తత్త్వమునకు చెఱకురసమువలన నేర్పడినవే. అవి దానికంటె నేకాంతభిన్నములును గావు, అభిన్నములునుంగావు. ఇట్టిచో చెఱకు వేర్వేఱువిధముల సేవ్యమైనది యనుట పొరపాటు.ఏల యనఁగా స్థూలముగ ననుభూతియందాయా భేదములు యథార్థములే. పాలు పచ్చివిగను కాచినవిగను సేవింపఁబడవచ్చును. నురుగులేకయు, నురుగుతోడను గ్రహింపఁబడవచ్చును. అట్టిచో పాలుభిన్నవిధముల సేవ్యమైనదియనుటపాడి. పరిణతియందన్నో యాకృతి మాఱుట ప్రధానము. ఆపాలనే పెరుఁగు, వెన్న, నేయిగ గ్రహించుట క్షీరపరిణత రూపగ్రహణమగును. అట్టిచో పాలు, పెరుఁగు, వెన్న, నేయి మొదలగువిధముల సేవ్యంబైనది యనుటపొర. అనుభవసమయమున స్థూలముగ పాలను ననుభూతి యుండిన సేవ్యంబనుట తగును. అట్లు కానిచో పరిణమించినదనుటయే యుచితము.

6. 'పరిణతా' యనుశబ్దము లేమింజేసి యనువాదమున వేఱొకలోపము వాటిల్లినది. రచయిత పైశబ్దముచే పరిణత రూపములు వేఱుగ భాసించినను మూలరూపమగుపరాశక్తిక భిన్నము లనియు, 'రశనాకుండలకటకంభేదత్యాగేన దృశ్యతే యథా హేమ', (మొలనూలు, కుండలములు, కటకములు మొదలగునవి భిన్నములగు నాకారముల త్యజించిన బంగరే యగును,) అన్నటుల భేదత్యాగమున దేవియు నఖండచిన్మాత్ర

గోచరయగు పరాశక్తియే యనియును స్పష్టముగ తెలియఁ జేసినాఁడు. ఇట్లు పరిణమించుట దేవికి క్రీడ. ఆమె తన లీలా రూపములఁ జూపుచు ననేకభూమికలఁ దాల్చుచు విడుచు చుండును. అదియే జగత్సృష్టిస్థితిలయముల యనులోమప్రతి లోమక్రమ మని యాకూతము. దేవి సేవ్య యనుటలో పైభావమంతయు నభావమైనది.

7. భవదీయాకృతి త్రివిధంబై, శతరూపమై, వివిధమై సేవ్యంబయ్యె. ఇచ్చట నొకసంశయమున కనువాదకులు ఎడము నొసంగుచున్నారు. ఆదిశక్తియే త్రివిధాదిరూపముల గ్రహించి నది. అవి సరస్వతీ, లక్ష్మీగౌరులు మొదలగునవియని ముందే చెప్పియున్నాము. అట్టిచో ఆదిశక్తిని నీవు సరస్వతివి నీవే కాళివి, నీవే లక్ష్మివి యని త్రివిధముల సేవించుటయా కవిహృదయము? లేక సరస్వతీగౌరీలక్ష్ములను మీరుఆదిశక్తిరూపములు ఆదిశక్తికంటె నభిన్నలు అని త్రివిధముల సేవ్యలుఃఅనుటయాః కవిహృదయము. అనువాదకులబడి దేవి పరిణతరూపము లొక్కొక్కటియు, నట్లు వేర్వేఱుగ సేవ్యము లనుటయే నిశ్చయము. ఇది తాంత్రికులమతము గాదు. శాక్తేయులమత మున 'ఉపాస్యత్వం చ మహాకాళ్యాదిద్వారా మూలశక్తే రేవ', (మహాకాల్యాదిరూపమున మూలశక్తియే యుపాస్య) మూలశక్తి త్రివిధంబై సేవ్య కాలేదు. త్రివిధములు మూల శక్త్యభిన్నములుగ సేవ్యంబు లయినవి. మూలశక్తి కాన్పింపదు. ఆమెరూపము సూక్ష్మాతిసూక్ష్మము. స్థూలములగు త్రి విధశక్తులను సూక్ష్మయగుపరాశక్తికంటె నభిన్నములుగఁ గొల్చుటయే శాక్తేయులమతము. [శాక్తాగమ మద్వైత

సిద్ధాంతమును ప్రతిపాదించునది. 'తత్త్వమసి, సోఽహమస్మి, సర్వం ఖల్విదం బ్రహ్మ' మొదలగు మహావాక్యముల నంగీకరించునది. అందు పరిచ్ఛిన్నములు మాయావృతములు నగు జీవాదులకు బ్రహ్మముతో నొండె, పరాశక్తితో నొండె యభిన్నత నెఱుంగుటయే సాధన. బ్రహ్మ మెన్నఁడును జీవుఁడని తెలియుట వేదాంతతాత్పర్యము కాదు. జీవుఁడు బ్రహ్మమే యని తెలియుటయే వేదాంతతాత్పర్యము. కాననే వేదాంతములందు 'జీవబ్రహ్మైక్య'మందురే కాని వ్యతిక్రమము చెప్పరు. అట్లే త్రివిధశక్తులు నభిన్నము లనుటయే సరి. ఆదిశక్తి త్రివిధములై సేవ్యయయినదనుట పొర.]

8. 'భవదీయాకృతి సేవ్యంబయ్యె' 'మూర్తిః పరిణతా' రచయిత పరిణామమును చెప్పెనుగాన దేవిమూర్తి మాఱినదనుట పొసఁగును. దేవియే సేవ్యయయినది. ఆమెయాకృతి మాత్రము గాదు. దేవి యెన్నియేని భూమికల ధరించియు మొదటిస్వరూపముననే వెలసియున్నది.

9. 'పెక్కుచందముల.' అమూలకము. వివిధంబై దేవియాకృతి సేవ్యయయినది అని చెప్పుట చాలక 'పెక్కుచందముల' సేవ్యంబయినది అని ప్రయోగింపఁబడినది. ఇట నన్వయము చేసికొనవలయునన్న త్రివిధంబై పెక్కుచందముల సేవ్యంబయినది. శతరూపమై పెక్కుచందముల సేవ్యంబైనది. వివిధంబై పెక్కుచందముల సేవ్యంబయినది యనునొకనీరసమును నిరర్థకమును నగునన్వయ మావశ్యకమగును. ఇది యేల?

10. 'సువివేకుల్' మూ. 'పూతాః' పూతాః యనిన పవిత్రులని యర్థము. వివేకులనికాదు. వివేకులను మాటకు వేర్వేఱు దర్శనములయందు వేర్వేఱర్థములు కలవు. వేదాంతమునందు వివేకశబ్దమునకు నిత్యానిత్యవస్తువిచక్షణయే యర్థము. సాంఖ్యమునందు ప్రకృతిపురుషాన్యతాఖ్యాతివివేకము వివేకమనిన సామాన్యార్థము తెలివి, అదే యుక్తాయుక్త పరిజ్ఞానము. ఇచట శాక్తేయులమతమున 'వివేక' శబ్దమున కెట్టియర్థ మనునదియే ప్రసక్తము.

"తయా త్వమేష వైశ్యశ్చ తథై వాన్యే వివేకినః
మోహ్యన్తే మోహితాశ్చైవ మోహమేష్యన్తి చాపరే,
తాముపైహి మహారాజ శరణం పరమేశ్వరీమ్
ఆరాధితా సైవ నృణాం భోగస్వర్గాపవర్గదా". సప్తశతి.

వివేకులును మోహముంగాంతురు. రాజా! యాపరమేశ్వరిని శరణుచొఱుము. ఆమె యారాధిత యగుచో నరులకు భోగస్వర్గమోక్షములనొసంగును. పైశ్లోకమున 'వివేకినః' అనుశబ్దమునకు 'అధిగతలోకశాస్త్రాః' లోకశాస్త్రముల నెఱింగినవారని శాక్తేయు లర్థము వ్రాసిరి. అట్లే,—

'జ్ఞానినామపి చేతాంసి దేవీ భగవతీ హి సా,
బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి.'

అట్లే,—'భ్రాంతేర్మహతీ శక్తిర్న వివేక్తుం శక్యతే నామ', అని మహామాయశక్తిని వివేచించుటకు వలనుకాదని యెల్లశాక్తేయులును నైకకంఠ్యముగ నుపయోగించియున్నారు. పిండితార్థ మేమన వివేకము (=అధిగతలోకశాస్త్రత)చే

దేవిని ఎఱుంగ సాధ్యముకాదు, ఆమెకృపగలపవిత్రులకే అది సాధ్యమని. అట్టిచో మూలశ్లోకమునందలి 'పూతాః' అను శబ్దము సార్థకము. అట్టిశబ్దమును విడనాడుటేల? అశ్లీలతా స్ఫోరక మనియా వీరిభావము?

11. 'అవివేకుల్'అమూలకము. అనువాదకులమతమున తత్త్వ మొకడంచు నెఱుంగువారు సువివేకులు. అట్లెఱుంగని వారు—దేవి త్రివిధాకారతను, సేవ్యంబైనరూపములను తత్త్వ మొకడంచు నెఱుంగక సేవించువారు—అవివేకులు. తానే యన్నివిధముల నాశక్తి సేవ్యయని యట్లు సేవించినవారి నవి వేకులఁ జేయుట యేటిన్యాయము?

12. 'త్వత్ప్రసాదాఢ్యులై' మూ. 'భవదరుణపాదాను సరణైః' (నీయరుణచరణముల ననుసరించుటచే నని భావము.) ఆంధ్రీకరణమున సువివేకులు లక్ష్మీప్రసాదమున నాఢ్యులై తత్త్వమెఱుంగుదురని. రచయిత శక్తిని 'జనని' యనినాఁడు. జననికి యవివేకులపై దయయుండును. వారును నామెపుత్త్రకులే కదా. సువివేకత్వమునకుఁ బ్రసాదాఢ్యత గతంబగుచో ప్రసాదాఢ్యతకు కారణమేమి? ఇట్టిసందియముల కాంధ్రాను వాదము తావొసంగును. మూలమున నీయూతులు లేవు. అందు తత్త్వమేకమని యెఱుంగుటకు మార్గము, తల్లిచరణ ముల ననుసరించుటచే పవిత్రులగుటయే యని స్పష్టముగఁ జెప్పఁబడియున్నది. అది యాంధ్రానువాదమున లోపించి నది. మూలము ననుసరించియుండిన దేవికి పక్షపాతదోషము చుట్టుకొనదు.

13. 'చెడుదు రియ్యర్థంబు శంకించుచున్.' మూ. 'చకిత హృదయాస్త్రర్కితభిదాః.' మూలమున వివక్షితము, దేవి యనేకరూపముల పరిణమించినను, నేకతత్త్వము నెవరెఱుంగుదురు ఎవరెఱుంగరు అనునది చెప్పుటయే. చెడుదురా చెడరా యనుట యవివక్షితము. శాక్తేయులమతమున చెడుటయే లేదు. శక్తియే సాధనచేయునది. సాధకునికి తెలియకయే సాధన జరుగును. శాక్తమతమున విశ్వమంతయు నఖండమగుసాధనను చేయుచునే యున్నది.

14. 'ఇయ్యర్థంబు శంకించుచున్' ఏయర్థంబు శంకించి చెడుదురోయాంధ్రానువాదమున తేలదు. దానిప్రకారము, చెడుట తత్త్వమొకడంచు దేవిప్రసాదముచే సాధ్యులు వివేకులు పరికింతురనునర్థమును శంకించియో, దేవియాకృతి పెక్కుచందముల నేవ్యంబయ్యో ననునర్థమును శంకించియో, తెలియక పద్యమునం 'దర్థమనర్థంభావయ నిత్యం' అనుశంకర **23** భగవత్పాదులవాక్యము ననుసంధించుకొనవలసినదేనా!

## III

ఆ. పితృమాత్రాత్మజబంధుసోదరసుహృద్ద్వేష్యాదిభావమ్ములు
ధృతసంకల్పసముద్భవమ్ములును మృత్పాంచాలికానర్తన
ప్రతిమానమ్ములటంచెఱుంగక పశుప్రాయాత్మమైయున్నలో
కతతిన్ సంసృతిపాశబద్ధమునుగాఁ గావింతు సర్వేశ్వరీ.

మూ. పితాసౌ మాతా మే తనయ ఇతి బంధుస్సహభవః
ప్రియేయం శత్రుర్మే సుహృదితి మనోమాత్రకలనైః
మృదంచత్పాంచాలీనటనసదృశైః విస్మితదృశః
పశూన్ జంతూన్ కృత్వా భవకృతిపిహ బధ్నాసి విపథే.

తా. ఇతఁడు నాతండ్రి, ఈమె తల్లి, ఇతఁడు పుత్రుఁడు, ఇతఁడు బంధువు, ఇతఁడు సోదరుఁడు, ఇది ప్రియ, ఇతఁడు శత్రువు, ఇతఁడు స్నేహితుఁడు; ఇట్టి మాటల వంటివగు మనోమాత్రసంకల్పములచే [illegible] ప్రాణులను భ్రాంతిఁ జెందిన దృష్టిగల పశువులుగ నొనర్చి భవము కల్గించు విరుద్ధమార్గమున బంధించుచున్నావు.



ప్ర. 1. ఉద్ధత. 2. ప్రతిమానమ్ములు. 3 లోకతతిః. 4. మూలమున కూర్పెంతయేని చిత్తాకర్షకము. మమతఁ గల్గించువాని నొండొంటిని ప్రధానములుగఁ దెలియఁజేయుటకు వ్యస్తప్రయోగములు. అనువాదకు లన్నింటిని నొక్కమాట గట్టిరి. పితృమాత్రాత్మజబంధుసోదర సుహృద్ద్వేష్యాదిభావమ్ములఁట ఇట్లు వ్యస్తముల సమస్తమొనర్చుటవలన రసపోషణ మేమేనియుఁ గలదా?

5. "ప్రియేయమ్." ఆంధ్రశృంగారకృతియందు శృంగారమే పూజ్యము. కానిచో పద్యమున మానసికకల్పనల కన్నింటికి కేంద్రమగు 'ప్రియా' శబ్దమును విడిచియుందురా? ప్రియ శృంగారాలంబములలో ప్రథమ; ఏషణల కన్నింటికి మూలకందము. స్త్రీ నాశ్రయించియే మాయాచక్రము తిరుగుచుండుట. అట్టిపదము పోవుట పద్యపుజీవకళ యేమో!

6. ఉద్ధతసంకల్పసముద్భవమ్ములును. 'ను' అను సముచ్చయప్రయోజన మేమి? [illegible] కాదు, ఉద్ధతసంకల్పసముద్భవమ్ములును ననియా? ఐన ఉద్ధతసంకల్పస

ముద్భవమ్ములేవి? వానియందలి యాథార్థ్య మేమి? రచయితయభి ప్రాయము సుహృద్ద్వేషాద్యధి భావములే మనోమాత్ర కలనలని— 'ఇతి మనోమాత్రకలనైః' నిరర్థకము లగుపదములు పద్యపు హారవును యథావిధిగ చెఱచినవి. డొంక తిరుగుడుగ నింకొక యన్వయము సాధింప జతనపడినను, ప్రతిమానమ్ములు'ను' అని సముచ్చయము వలసియేయున్నది.

7. మృత్పాంచాలికాన ర్తన ప్రతిమానమ్ములటం చెఱుంగక. మూలమున 'మనోమాత్రకలనైః' విశేష్యము. దానికి విశేషణము మృత్పాంచాలికాన ర్తన ప్రతిమానమ్ములు. మతి యాటక త్తె. దానికలనలు న ర్తనములును నగును. దీనినే 'మనీషాశైలూషీమ్.' అని కవి సూచించియున్నాఁడు. విశేష్యములను రెండింటిని విశేషణములుగనొనర్చుటఁజేసి ఉద్దేశ్యమగు 'మనోమాత్ర కలన' లప్రాధాన్యము పోయినది.

8. 'ఎఱుంగక' 'విస్మితదృశః' విస్మయము చెందిన చూపుగలవారినిగా నొనర్చి యని భావము. ఇట్టిమనోమాత్ర కలనలచే క్షేత్రజ్ఞుల భ్రాంతులుగ చేయుటయే వారిని పశువులుగఁ జేయుట. దేవియే క్షేత్రజ్ఞుని పశువుగను విస్మితదృక్కుగను నొనర్చునది. అదియే యామెలీల. దీని నెఱుంగక యనువాదకులు,

9. 'పశుప్రాయాత్మమైయున్న' అని 'పశూన్ కృత్వా' యనుపదముల తెలింగించిరి. ముందే వారి 'లోకతతి' పశుప్రాయాత్మమై యుండలేదు. దేవియే వారిని పశుప్రాయులుగఁ గాదు (10) పశువులుగ నొనర్చి బంధించినదని మూలము. ఇదియే శాక్తసిద్ధాంతమును.

ఈశునిస్వాత్మావరణమే దేవి. 'దేవీమాయాశక్తిః స్వాత్మావరణం శివస్యైతత్' 'మాయాపరిగ్రహవశాత్ బోధో మలినః పుమాన్ పశుర్భవతి'. శక్తి పురుషుని యావరించి మలినబోధునిగ నొనర్చును, విస్మితదృక్కుగ నొనర్చును. అదియే యతనిని పశువుగ నొనర్చుట. దేవియే బద్ధునిగను ముక్తునిగను నొనర్చును. ఇదియే యౌపచారికముగ పరమశివునియందుఁ జెప్పఁబడినది. 'స్వజ్ఞానవిభవభాసనయోగేనో ద్వేష్టయన్నిజాత్మానమ్' ఇతి బంధమోక్షచిత్రాం క్రీడాం ప్రతనోతి పరమశివః.' పైసిద్ధాంతమును శాక్తగ్రంథము లెన్ని విధములనో యుద్ఘోషించియున్నవి. కాలికాపురాణమున,

"ఉత్పన్నం జ్ఞానరహితం కురుతే యా నిరన్తరమ్
ఆహారాదౌ తతో మోహం మమత్వం జ్ఞానసంశయమ్,
క్రోధోపరోధలోభేషు క్షిప్త్వా క్షిప్త్వా పునఃపునః
పశ్చాత్ కామే నియోజ్యాశు చిన్తాయుక్తమహర్నిశమ్.
ఆమోదయుక్తం వ్యసనాసక్తం జన్తుం కరోతి యా
మహామాయేతి సా ప్రోక్తా తేన సా జగదీశ్వరీ"

సుఖదుఃఖాదులయందు పడవైచి, కామక్రోధాదుల కెర యొనర్చి క్షేత్రజ్ఞుని పశువుగ నొనర్చునదియే మహామాయ. అట్లే,—

'మాశ్చ మోహార్థవచనః, యాశ్చ ప్రాపణవాచనః
తం ప్రాపయతి యా నిత్యం సా మాయా పరికీర్తితా'.

మోహమును చెందించునది మహామాయ.

మఱియు,

'బధ్నాతి కాచిదపి శక్తిరనంతశక్తేః
క్షేత్రజ్ఞ మప్రతిహతా భవపాశజాలైః'

అని యవధూతసిద్ధపాదులవారు దేవి క్షేత్రజ్ఞుని పాశబద్ధునిగ నొనర్చునది యని చెప్పి అందున పశువునుగ చేయునది దేవియే యని సూచించియున్నారు. ఈశుఁడు మాయకు పాశ్యుఁడై నందువలననే పశునామమును ధరించుచున్నాఁడు. అభినవ గుప్తులు దీనిని చక్కఁగ 'మాయాయాః పాల్యః పాశ్యశ్చ ఇతి పశుః' అని చెప్పియున్నారు. ఆపాశముల పేర్లు 'ఆణవ-మాయీయ - కర్మమలస్వభావానాం. పాశానాం భాజనమ్' అని చెప్పియున్నాఁడు. కాలికాపురాణమున మాయ కర్మ మలస్వభావముల నెట్లు కల్పించుచున్నదో స్పష్టము. ఇట్టి సిద్ధాంతము 'పశుప్రాయాత్మమైయున్న' అను ననువాదముచే రూపుమాసినది.

10. 'సంసృతి పాశబద్ధమునుగాఁ గావింతు.' మూ. 'భవకృతిహి విపథే బధ్నాసి' భవమును కల్గించువిమార్గమున నని. 'పశూన్ కృత్వా' యనుటయందే పాశబద్ధమును గావిం చుట స్పష్టము. ఇట వివక్షితము పశువగుటవలనిఫలము భవము కల్గు విమార్గమున బంధింపఁబడుట. ఈరహస్య మను వాదమున లోపించినది. భవబంధనము విమార్గమని రచయిత.

**33** ఆంధ్రీకర్త కిది సుపథ మైనది.

## IV

ఆ. భ్రమచేఁ దత్తదభీష్టముల్ పడయఁగర్మ ధ్యాననైష్కర్మ్యవృ త్తములన్ గొందఱుపంశ్రయింతురయినన్ దత్త్వైక తాత్పర్యవి

త్తములత్యు త్తమమంగళమ్మనిసముద్యత్తావకీనాకృతి
క్షములై మిం త్రుసుమీా, పురాణపురుషోత్సంగాగ్రసంవాసినీ!

మూ. క్రియాః కుర్వంత్యేకే, భగవతి సుఖార్థం యతధియః
తథా ధ్యాయంత్యేకే పరమపురుషోత్సంగనిలయే,
ఉదాసీనాశ్చాన్యే శ్రుతిచరమతాత్పర్యకుశలాః
శ్రయంతి త్వద్రూపం పరమనుపమం మంగళమితి.

తా. భగవతీ! సుఖముకొఱకై కొందఱు పూనికతోఁ గర్మల నాచరించెదరు. పరమపురుషోత్సంగనిలయా? మఱి కొందఱు చిత్తమును యమితముచేసికొనినవారై యందులకే ధ్యానమొనర్చెదరు. కాని శ్రుతిచరమతాత్పర్యమునఁ గుశలు లుదాసీనులై (సుఖార్థముగాక) నీపరరూపమును సాటిలేని మంగళమని యాశ్రయింతురు.

ప్రా. 1. విత్తములన్ 2. వృత్తములన్. 3. క్షములు. య. 4. సముద్యత్ పా. పూ. 5. ఏక 6. సముద్యత్తావకీ నాకృతిక్షములై.

7. తత్తదభీష్టముల్ పడయ. మూ. సుఖార్థం. ప్రాణి సమూహమంతయు సుఖమునే కదా కోరును. కర్మలఁ జేయుట, యోగధ్యానముల నవలంబించుట అన్నియు సుఖము కొఱకే. రచయిత ప్రాణివర్గమునంతయు సర్వతోముఖముగఁ బాలించు సుఖేచ్ఛంగూర్చి చెప్పఁ గోరెను కాని క్షుద్రము లగు నాయాయభీష్టములఁ గూర్చి కాదు. ఆంధ్రమున తత్తద భీష్టములనిన నేయభీష్టములను నాకాంక్షమాత్రము నిల్చును. సుఖార్థమనిన నట్లుగాదు.

8. కర్మధ్యాననైష్కర్మ్యవృత్తములన్ గొందఱు. మూ. 'ఏకే క్రియాః కుర్వంతి, అన్యే యతధియః ధ్యాయంతి అన్యే ఉదాసీనాః.' ఇట నాంధ్రీకర్తలు నైష్కర్మ్యవృత్తము లని యుదాసీనులనుఁ గూడ క్రించుచేసిరి. శ్లోకతాత్పర్యము ను వారు చక్కఁగ నెఱుంగఁజాలక పోయిరి.

8. అన్వయమే వారికి తెలియలేదు. రచయిత యాశయ మిట్లు. కొందఱు సుఖార్థము కర్మముల నాచరింతురు. మఱి కొందఱు అందులకే ధ్యానము నొనర్చెదరు ఇది పూర్వార్ధ పుటాశయము. దానిని స్పష్టముఁజేయ 'తథా' అని కర్మముల జేయువారివలెనే ధ్యానముంజేయువారును నని యిరుతెఱం గులవారి నొక కోటియందుఁ జేర్చి శ్రుతిచరమతాత్పర్య కుశలులనుఁ గూర్చి యుత్తరార్ధమునఁ జెప్పిరి. వారు కర్మ ఠులు యోగులు మొదలగువారికి భిన్నులు. తొల్త చెప్పిన వారు సుఖార్థము జతనము నేయుదురు. సుఖవిషయమున శ్రుతిచరమతాత్పర్యకుశలులుదాసీనతఁ బూనుదురు. దేవి పర రూపమును మంగళమని యాశ్రయింతురు. వారి కేలాటి కామమును లేదు. దీనిని తెలిసికొనఁజాలమి 'ఉదాసీనాః' యను పదమును ధ్యానకోటి యందుఁ జేర్చిరి.

9. రచయిత వేర్వేఱుమార్గములను 'క్రియాః కుర్వం త్యేకే అన్యే ధ్యాయంతి' అని నిర్దేశించి యుండ నాంధ్రికర్త లొక్కసమాసమునుగా 'కర్మధ్యాన...వృత్తములన్' అని రచించిరి. వారిలో కొందఱు మూఁడుమార్గముల ననుసరించెద రనియే యాంధ్రీకర్త.

10. ధ్యానప్రకారమును విశేషించి చెప్ప 'యతధియః' మునిఁగిపోయినసరకులలో ముఖ్యము. ఇతరవిషయములనుండి దృష్టిమరల్చి ధ్యేయముననే చూపునేకతానముఁ జేయుట ధ్యానము.

11. 'నైష్కర్మ్య వృత్తములక'. మూ. ఉదాసీనా శ్చాన్యే. నైష్కర్మ్యము కర్మాభావము. వృత్తము కర్మము. ఒకటి చిత్తవృత్తినిరోధాలంబకము. వేఱొకటి చిత్తవృత్త్యా లంబకము. అభావమునను వాదకులు కర్మమందురా?

12. ఉదాసీనత యనిన నైష్కర్మ్యమునుం గాదు. ఉదాసీనత యనిన తాటస్థ్యము 'ఉదాసీనా వయం నూనం నస్త్ర్యపత్యార్థకాముకాః' అని దారవిత్తాద్యేషణలయందు విముఖతఁజెందుటయే యుదాసీనత. నైష్కర్మ్యము చేకూరిన తరువాత నౌదాసీన్యమబ్బును. రెండును సమానార్థకములు గావు.

13. 'నైష్కర్మ్య' మనుశబ్దము నిట నాంధ్రీకర్త లే యర్థమునఁ బ్రయోగించిరనునదియు తెలియఁదగినదే. ఆంధ్రీ కర్తల కాశబ్దార్థము తెలియలేదు. వేదాంతులమార్గమున నై ష్కర్మ్యగ్రంథులు సడలినపిదప చిత్తశుద్ధివలన క్రమపరంపరతఁ బ్రాప్తమగు కర్మాభావస్థితి, జీవన్ముక్తస్థితి. ఇదియే యనువాద కులతాత్పర్యమైన వీరికి తాంత్రిక శాక్తసిద్ధాంతము తెలియనే తెలియదని స్పష్టము. ఏలయన వేదాంతమునను, శాక్తాగమ మునను నైష్కర్మ్యసిద్ధి యపేక్షణీయము. పరమప్రాప్యమును నదియే. దేవిపేర్లలో 'నైష్కర్మ్య' యనునదియు నొకటి- 'నైష్కర్మ్యాయై నమః' (శ్రీలలితాసహస్రనామములు)

14. తత్త్వైకతాత్పర్యవిత్తములు. మూ. శ్రుతిచరమ తాత్పర్యకుశలాః.

రచయిత నుడివిన 'శ్రుతిచరమతాత్పర్య' యనుపదములు ప్రధానములు. దేవినామములలో 'వేదాంతమహావాక్యజన్యసాక్షాత్కారరూప పరబ్రహ్మవిద్య' యనునది యొకటి యని త్రిశతి కంఠోక్తముగఁ జెప్పుచున్నది. త్రిశతియే దేవిని 'సర్వవేదాంతతాత్పర్యభూమి యని చెప్పుచున్నది. శ్రుతిచరమములు వేదాంతములు, ఉపనిషత్తులు వానితాత్పర్యము బ్రహ్మసాక్షాత్కారమే 'సర్వేషాం వేదాంతవాక్యానాం బ్రహ్మణ్యేవ తాత్పర్యః' ఇత్యాది యిందులకుఁ బ్రమాణము. బ్రహ్మజ్ఞానమే బ్రహ్మమనుట. ఆతాత్పర్యమున కుశలులనఁగా మోక్షమార్గమును చక్కఁగ నెఱింగినవారు. అంతియకాదు. అధికారుల నామార్గమున నడుపంగలవారును.

'శ్రుతిచరమతాత్పర్యకుశలాః' అనుటకు తత్త్వైకతాత్పర్యవిత్తము లనుట యెట్టియనువాదము? శ్రుతియనిన తత్త్వముకాదు. తత్త్వమున కేకతాత్పర్య మేమియుండఁగలదు? తత్త్వజ్ఞానమున కదియే తాత్పర్యము. తత్త్వమునకు ముఖ్యతాత్పర్యము తత్త్వైకతాత్పర్యము. దాని నెఱుంగువారు తత్త్వైకతాత్పర్యవేదులు. అందుత్తములు తత్త్వైకతాత్పర్యవిత్తములని విగ్రహము చేయుదురా? అర్థమేమి? తత్త్వవిదులనియేకదా. ఇంతమాత్రమున కాప్రయాస యేల, కొండఁ ద్రవ్వి ఎలుకఁ బట్టనేల?

15. ఒకవేళ నట్టియనువాదమున కెట్లేని అంగీకరించినను వేఱొకలోపము పొడసూపును. ఆగమములు రెండు విధములు,-

'శైవాగమోఽపి ద్వివిధః శ్రౌతోఽశ్రౌతశ్చ సంస్మృతః,
శ్రుతిసారమయః శ్రౌతః స్వతంత్ర స్త్వితరో మతః.'

శ్రౌతములనియు నశ్రౌతము లనియు. లక్ష్మీతంత్రము శ్రౌతాగమము. దానిని సూచించుటకే శ్రుతిచరమతాత్పర్యే త్యాదిప్రయుక్తము. ఇట్లు శాక్తాగమమునకు వైదికత నాపాదించు 'శ్రుతి' శబ్దము నొక్క చిటికతో నెగురవేయుట ప్రౌఢియా?

16. 'అత్యుత్తమ మంగళమ్మని' మూ. పరమనుపమమ్. 'అనుపమమ్' అనిన సాటిలేని యని యర్థము. అత్యుత్తమ మనిన శ్రేష్ఠతమమని.

17. 'సముద్యత్తావకీనాకృతిక్షములై' ఈసమాసమున కేమి యర్థము? నీపరరూపము ననుపమ మగుమంగళమని యాశ్రయింతురనుట కిది యనువాదకుల యనువాదము. సమాసమున కర్థము 'ప్రకాశించుచున్న నీయాకృతిచే సమర్థులై' యని గావలయు. ఈ తెనింగింపు మందము.

18. పురాణపురుషోత్సంగాగ్రసంవాసినీ. మూ. 'పరమపురుష' పరముఁడుత్తమోత్తముఁడు. శృంగారకృతియందు నాయకుని పురాణపురుషుఁడనిన ముదుక యని స్ఫురింపక మానదు. ఆంధ్రీకర్తలు పరముని ముదుకగ నొనర్చుట సరసమా? ముదుసలియైనను దేవి పతివ్రత యని చాటుటకై గావలయు. పరిపూర్ణానందుఁడు పరమపురుషునియొడి పరమును ననుపమమునగు రూపము కల పరదేవతకు నిలయమని పాడినాఁడు. త్రిశతియు దేవికి 'ఈశ్వరోత్సంగనిలయ' యను నామమును జెప్పుచున్నది. కాని శృంగారకృతిం జేఁబూనిన

రసహాయి యాంత్రీకరణకర్త చంచలకు ముదుసలిని కట్టి పెట్టినారు.

19. పరను దేవిని పరమునియొడిలోఁ గూర్చుండఁబెట్ట నిచ్చగింపక 'ఉత్సంగాగ్రసంవాసిని'గా నొనర్చిరి. ఉత్సంగ మనిన నొడి, యూరువును. ఉత్సంగాగ్రమనిన నేమి? ఒడికొన యంచా? ఒడి ముందా? ఎట్లైననేమి, ఒడిలోఁ గాదు కదా? ఊరువుపైఁ గాదుగదా? అట్లైన 'అగ్ర' యనుట కర్థమేమి? అభినవనిఘంటువున 'అగ్ర' యనిన, 'మీఁద, అందు' అనునర్థ ములు గలవేమో. తెల్గులో లక్ష్మి, చంచల, పురాణపురుషుని కట్టుకొన్నందులకు 'అగ్ర'చే సంవాసమున కనుకూలమగు స్థానమే చిక్కినది. ముదుసలి యొడికొనను, తొడకొనను గాక, ఒడిలో 'చంచల' గూర్చుండదు కదా? తెన్గులో సింగా **52** రము చెడినది.

## V

ఆ. సరసిజగర్భశార్ఙ్గధరచంద్రకలాభరణుల్ జగత్త్రియా
భరణవినాశముల్ సలుపు పాండితికిఁ గతమైనయట్టి నీ
చరణయుగమ్ము గాక జనసంతతి కన్యము గల్గునే శుభో
త్కరపదవీప్రదర్శకము, గావున నిన్ వినుతింతు భార్గవీ!

మూ. విధాతా నిర్మాతా జనని తవ సాహాయ్యకలనాత్
విధుర్వా సంధాతా సకలజగతాం క్షేమమసకృత్
కపర్దీ సంహర్తా భవతి హి భవత్యాశ్చరణతో
న జానే జంతూనాం పరమగతిదం మంగళపదమ్

తా. జననీ! నీసాయ ముండుటవలననే విధాత నిర్మాత. దాననే కదా విధుఁడు సదా నిఖిలజగములకు క్షేమము నొనఁ

గూర్చును, కపర్దియు సంహర్త; అట్టినీచరణమునకంటె నన్యము జంతువులకు పరమగతి నిచ్చునది మంగళమున కాస్పద మెచ్చటఁ గాంతును.

ప్రా. 1. శుభోత్కర. య. 2. పాండితికిఁ. 3. చంద్ర కలాభరణుల్. 4. కావున. పా. పూ 5. కావున నిఁ విను తింతు భార్గవీ!

6. సరసిజగర్భశార్ఙ్గధరచంద్రకలాభరణుల్. ఆంధ్రీ కర్తకు వ్యస్తములనెల్ల ప్రతిపట్టిసమస్తములఁజేయు నొక్క యపూర్వమగుశక్తి గలదు. వ్యస్తము లగుప్రయోగములకు బలము తక్కువ యనియు, సమస్తమున కెక్కువ యనియు వారియభిప్రాయము. కొన్ని చోటులనది నిజమేకావచ్చుఁగాని యెచ్చట గ్రంథకర్త వ్యస్తప్రయోగమున రసాభ్యుచితిం గాపాడఁ గోరునో యట సమస్తమును ప్రయోగించి యథా సంఖ్యమువంటి యలంకారమునకై సాముచేయుట ఎంత మాత్రము నుచితము కాదు.

7. సరసిజగర్భ. మూ. విధాతా. క్షేమేంద్రుఁడు 'అనౌచిత్యాదృతేనాన్యద్రసభంగస్య కారణమ్' అని యనినది యిట్టితావులం జూచియ గావలయును. లేదేని సృష్టిస్థితిలయ కర్తలం దడవుచు సాభిప్రాయముగ పదముల మూలమునఁ బ్రయోగించియుండ నాంధ్రీకర్తలు పరిత్యజించిరి. విధాత (=విధించువాఁడు). నిర్మాత(=నిర్మించువాఁడు). విధించువాఁడే నిర్మించినసృష్టి యెంతయేని యొప్పియుండును. 'సృష్టి'కిని 'సరసిజగర్భుని'కిని ఏటి సంబంధము? పర్యాయపదము లైననే చాలదు. శబ్దౌచిత్యముం బరికింపవలయును.

8. శార్ఙ్గధర మూ. విధుః. కోదండమును బూనుట. జగద్భరణముకొఱకని కొంతవఱ కౌచితిం గాపాడినను నది యిట వివక్షితము కాదు. ఇట నాయామూర్తుల కర్తవ్యముల స్ఫురియింపఁ బల్కుటయే యుద్దిష్టము. జగద్భరణము శార్ఙ్గధరుఁ డైనను చేయును, చక్రియైనను జేయును. సాధనవిశేషమును సూచించుటలో ప్రధానత యేమియును లేదు. జగద్భరణ మనుకర్తవ్యము విధునిదికాన 'విధు' శబ్దమే ప్రధానము. విధుః=విధ్యతి అసురాన్ ఇతి. అసురులను ఖండించువాఁడు. అట్లు ఖండించి జగత్సమూహమున కెల్లప్పుడు క్షేమము నొనఁ గూర్చుచుండునని ధ్వని. ఈస్వారస్య మాంధ్రమున నెగిరి పోయినది.

9. చంద్రకలాభరణుల్. మూ. కపర్ది. జడలు ధరించు వాఁడని మూలము. తనపనికి సంహారణమున కెంతయుఁ దగినమోటువాఁడు. ఆలోకము లేర్చెడుప్రళయాలోక దుర్నిరీక్ష్యుని యాకృతివిశేష మియ్యది. శంభువనక కపర్ది యనుటచే నర్థస్ఫూర్తి యొనఁగూడినది. అనువాదకులు చంపుటకు చల్లనిజాబిల్లివెల్లునాభరణముగాఁ గల 'చంద్రకలా భరణుఁడ'ని తెలింగించిరి. చంద్రశబ్దమున నాహ్లాదముఁ గొల్పు వాఁడని ధ్వని. శబ్దౌచిత్యము నాంధ్రీకర్తలు మఱచిరి.

10. జగద్భరణ. మూ. సంధాతా సకలజగతాం క్షేమ మసకృత్. ఎల్లప్పుడు నిఖిలజగములకు క్షేమమునొనఁగూర్చు నని మూలము అనువాదము జగత్తును భరించునని. ఏమి

యనువాద మియ్యది! ఔచిత్య ముపలక్షించుటయన నిదె యేనా?

11. 'సలుపు పాండితికిఁ గతమైనయట్టి' మూ. 'తవ సాహాయ్యకలనాత్.' జననీ! నీసాయముండుటవలననే విధాత నిర్మాత యగుట, విధుఁడు క్షేమసంధాత యగుట, కపర్ది సంహర్త యగుట. అట్లు త్రిమూర్తులకును వారివారి కర్తవ్యముల యందు సాయము చేయునది దేవి, అని యామెమహిమను బొగడి యట్టియామెచరణమువకంటె మనకు మానవులకు వేఱుండ లేదని మూలమున. ఇదియంతయు నాంధ్రీకరణమున లోపించినది. మూలమున దేవిచరణములకును త్రిమూర్తుల శక్త్యుల్లాసములకును సంబంధము లేదు. అనువాదకులో దేవి చరణములే త్రిమూర్తుల యాయాక్రియాకలాపపాండితికి కారణములని. తల్లీ! నీసాయమున త్రిమూర్తులు వారివారి పనులఁ జేయుదురనుటకు నీచరణయుగము వారివారిపనులఁ జేయుపాండితికిఁగతంబైనట్టిది యనుట ముక్కుసూటి యనువాదము, రసపోషకము గావలయు!

12. భార్గవీ. మూ. జననీ. (=తల్లీ). ప్రథమపాదమున జననకారణము, త్రిమూర్తులకును తల్లియని ధ్వని. ఆమెయే 'త్రిధా భిన్నా' పూర్వం' మువ్విధమునఁ బరిణతింగాంచ క్షేత్రజ్ఞుఁడు బ్రహ్మ విష్ణు మహేశు లైనాఁడు. ఆమెయే వారికి తల్లి. మనకు తల్లియని వేఱ చెప్పవలయునా? అట్టి కమనీయశబ్దౌచితిం బోనాడి భార్గవి యనునీరసమగు శబ్దమును వైచినారు. భార్గవి యనిన భృగుపుకుమారిత యని. ఏమిరస వత్తరమగునాంధ్రీకరణము! జీవకళ యిందియ కాఁబోలు.

13. భార్గవింగూర్చి యచ్చట తడవుటకన్న వేఱుపార యాంధ్రీకర్తయనభిజ్ఞతను తెలియఁజేయనేరదు. భార్గవి విష్ణు పత్ని. ఇట వివక్షిత మహాలక్ష్మి. ఆమె గౌరీసరస్వతీ భార్గవులను కన్నతల్లి; భృగువునే సృష్టించిన పరాశక్తి; భార్గవి పతియగు విష్ణునిఁ గన్న యాదిశక్తి. తనపత్ని భార్గవి చరణయుగమును సేవించియూ విష్ణువు జగద్భరణము సలుపుపొండిలిఁ బొందినది! చక్కఁగ నున్నది క్రమము! అందఱు భార్గవియే విష్ణుపాద ములఁ గొల్చునని యెఱుంగుదురు. ఇది 'యభినవ' ప్రౌఢియా?

14. శుభోత్కరపదవి. మూ. పరమగతిదం మంగళ పదమ్. పరమగతినిచ్చు మంగళపదమని మూలము. దేవిచరణ ములు మంగళమున కాలవాలములు (మంగమన సంసారము, దానిని ఛేదించునది మంగళము) పరమగతి నొసంగును. పరమ గతియందు ఖండములు లేవు, ఉత్కరములుఁ మాత్ర మెట్లుం డును? శుభముల ప్రోవుగాదు పరమగతి. అది మంగళస్వరూ పము. అది యనువాదకులకుఁ దెలియలేదు.

15. పదవీప్రదర్శకము మూ. పరమగతిదమ్. రచయిత పరమగతిని—ముక్తినిచ్చునది యని. అనువాదకులమతమున దేవిచరణములు శుభోత్కరపదవిని చూపునేగాని యాపదవి నిచ్చుటకు వలంతులు గావు. దేవుఁడు ప్రత్యక్షమై అనుగ్ర హించినను పూజారి అనుగ్రహింపఁడనినట్లు రచయిత యిచ్చి నను అనువాదకులు యీనొల్లక ఊరక ఆశపెట్టసాగినారు.

**67** రెంటితారతమ్యా మింతియ.

## VI

ఆ. స్తనజఘనాస్యభాగవరసంపదఁ గామకలాకృతిఁ దన
ర్చననిను నాత్మ నెవ్వఁడుభజించు స్మరుండతనిఁ నిటాలలో

చనునిబలెక్ గనుంగొన సశంకుఁడవుచు దదధీనలింతులా
తనిశరణమ్ము గోరి ప్రపదమ్ముల వ్రాలుదురమ్మ భార్గవీ!

మూ. హృది స్మారం స్మారం మనసిజకలాకారకలితాం
భజేత్త్వాం యో ధీర స్తనజఘనభాగాస్యఘటితాం,
అనంగ స్తం ద్రష్టుం హరమివ సశంకస్సువదనాః
స్మరాధీనా స్తస్య ప్రపదముపయంత్యాశు శరణమ్.

తా. ఏధీరుఁ డుపాసకుఁడు స్తనజఘనముఖభాగములఁ దనర్చునిన్ను మనసిజకలాకారవై యొప్పుచున్నదానిని తన హృదయమున స్మరించి స్మరించి సేవించునో యతనినిఁ జూడ నంగరహితుఁడు మన్మథుఁడు హరుని చూచుటకుఁ బోలె జంకును. నెమ్మోముగలసుందరు లాధీరునిచేరి కామశరార్తలై యతనిపాదాగ్రమును శీఘ్రముగ శరణుచొత్తురు. ఈ శ్లోక మమృతపుబుగ్గ. దీనికి ప్రాణసారములగు పదములు ధీరః, స్మారంస్మారం, అనంగః, హారమ్, సువదనాః, ఆశు యను నవి. తెన్గుశృంగారకృతియందు వీని కన్నింటికిని స్వస్తి. ఉపాస్యశక్తిని భోగ్యశక్తికంటె భిన్నముగఁ జూచుచునే యందు భోగబుద్ధిని గల్గించు నుత్తేజకముల నన్నిటిని గల్పించుకొనియు వానివలన ధృతి సెడక భోగ్యబుద్ధినిఁ బొందకుండుట యీసాధనరహస్యము. దేవిని మనసిజకలాకారనుగ భజించుట యన నసిధారావ్రతము. పిఱికిగుండెలు దేవిమోహినీరూపమును చూడఁగనె చెదరి కలగుండగును. సాధనమున వారు చ్యుతులయ్యెదగు. ఇట్టిసాధనకు ధీరులె దంటలు. కామకలాకారను అందును స్తనజఘనభాగాస్యఘటితను 'స్మారం స్మారం' స్మరించి స్మరించి భజించుట సామాన్యము కాదు.

స్తనయుగ్మము, జఘనభాగము, ముఖశ్రీ ఇవియేగదా జీవుని చిత్తమును వశముఁ దప్పించి మ్రుచ్చిలునవి. ధీరాతిధీరుఁడే పైసాధనను జితేంద్రియుఁడై చేయఁగలఁడు. కాన శ్లోకము నందలి ధీరశబ్దమును 'స్మారం స్మారం' యనుటయు సార్థకములు. ఆంధ్రీకర్తలు భావగాంభీర్యమును గుర్తెఱుంగలేదు. శ్లోకమునకు ప్రాణభూతము లగుపదముల నీడ్చివైచినారు. మూలభావ మిట నభినవహృద్యకావ్యఘణితియం దభావమైనది. 'ధీరః' అనుట కనువాదము 'ఎవ్వఁడు' అని. ఇట్టిచో ననువాదము ధీరుల కెట్లు రుచించును?

3. స్మరుండు. మూ. అనంగః. అంగరహితుఁడు. కాననే 'హరు'ని చూచుటకు జంకునట్లు అని 'హరమివ' అని మూలము హరునిఁ జూచిన మన్మథుని కేల భయమనిన నతని క్రోధాగ్నివలననే మన్మథుఁ డనంగుఁడాయెను. కాననే మనసిజ కలాకారకలితను దేవినిఁ జూచియు నేధీరుఁడు తనయింద్రియ వశిత్వమును వీడఁడో అతని కన్నెత్తి చూచుటకును ననంగుఁడు జంకుననుట. కాన ననంగశబ్దము సార్థకము. స్మరశబ్దమట్లుకాదు. వీరుఁడగు సాధకుఁడు చేయుసాధనామహిమం జెప్పుటకు ఉపమ. అనువాదమున నౌపమ్యమును శోభావహముగఁ జేయు 'హరఅనంగ'శబ్దములు తీసివైచుటవలన హృద్యమగుభావము మరణముంబొందినది.

4. ఇంతులు. మూ. సువదనాః. సుందరమగుమోము గలవారు, అందగత్తెలు. స్మరాధీనలగునింతు లతని శరణు చొత్తురనుట కాదు ఇట వివక్షితము. ఎవరు, తమనెమ్మోము దర్శనమాత్రమున నెంతటివానిచిత్తమునేని మ్రుచ్చిలంగల

వారో యట్టిసుందరులును స్మరార్తలై అతనిపాదాగ్రముల శరణు చొఱవలసినదే యని వీరసాధకుని ధైర్యాతిశయముం జెప్పుటయే వివక్షితము. అట్టిచో సువదనశబ్దస్వారస్యము 'ఇంతి' కి లేదు. ఏయింతులో శరణని యతనిపాదముల వ్రాలిరనిన అతనిధీరత యేమి గొప్పయని తెల్లమయినది?

5. మూ. 'ఆశు' శీఘ్రముగ, వెంటనే యని. సుందరాంగు లతనిని సమీపించియు నతనిని చలింపంజేయఁజాలరనుటకు, అతనిని సమీపించియు సమీపింపకముందె పాదముల వ్రాలవలసినవారే, కన్నెత్తి యైనం జూడఁజాలరు, అని యాధీరుని మారవిజయోత్కర్ష చెప్పంబడుచున్నది.

**72**

## VII

ఆం. కరమున విత్త, మాస్యమునఁ గమ్రకవిత్వము, గేమునన్
గుణోత్తరయగు నుత్తమాంగన, యెదన్ నినుఁ బేరు
కొనం దలంపు; సాధురతి సతమ్ము, తత్త్వనిరతుండు
గురుండు; ఘటిల్లునెల్ల భవాస్వరబహుజన్మసాధిత భవచ్చర
ణార్చనకున్ ఫలాకృతుల్.

మూ కరే విత్తం, వక్త్రే సరసకవితా, సాధువదనా
గృహే సాధ్వీ,భక్తిస్త్వయి హృది,గురుస్తత్త్వకుశలః,
సదా సద్భిస్సంగో బహుజని కృతాయాశ్చరణయోః
వరివస్యాయాస్తే ఫలమితి హి మన్యే సుకృతినాం.

తా. కరమున విత్తము, వక్త్రమున సరసకవిత, ఇంట సాధ్వియుసాధువదనయు నగునిల్లాలు, హృదయమున నీయందు భక్తి, తత్త్వకుశలుఁ డగుగురువు, నిరంతరము సాధుసాంగ

త్త్వము ఇవన్నియు బహుజన్మముల చేసిననీచరణసేవకతమున పుణ్యవంతులకుఁ గల్గుఫలములనుట నిశ్చయము.

ప్ర. 1. గుణోత్తర 2. సాధురతి 3. భాస్వర. యు. 4. నిరతుండు. పా. పూ. 5. ఉత్తమాంగన. 6. ఘటిల్లునెల్ల. 7. ఆకృతుల్.

8, 9. గుణోత్తర యగునుత్తమాంగన. మూ. సాధు వదనా సాధ్వీ. గుణోత్తరయనిన సాధువదన యనునర్థము లేదు. అట్లే సాధ్వియనుటకు నుత్తమాంగన యనుట యర్థము కాదు. సాధువదనయనిన సుముఖి. ముఖముఁ గాంచినంతనే ప్రసన్నతం గలుగఁజేయునది. గుణ=గుణములచే, ఉత్తర= శ్రేష్ఠయగు, ఉత్తమ=శ్రేష్ఠయగు, అంగన=స్త్రీ, ఇందు పౌన రుక్త్యము పాదపూరణమాత్రప్రయోజకము. 'సాధువదన', 'సాధ్వి' యనుపదములస్వారస్యము పోయినపిదప నేదేని ఒకటియే చాలదా? ప్రాసకై యొకటియు, పాదపూర్తికై మఱియొకటియు, పద్యమునకై యంగనయు వలయునా? ఇది యేనా పద్యముల 'జీవకళ'!

10. ఎదఁ నిను పేరుకొనందలంపు. మూ. భక్తిస్త్వయి హ్యాది. భక్తియనిన 'కస్మైచిత్ పరమప్రేమరూపా'పరమప్రేమ రూపము భక్తి. అనువాదము 'పేరుకొనందలంపు' ఈయను వాదమును విని భక్తులెల్లరు సిగ్గుపడవలసినదే శృంగారకృతి యందలి పరిపూర్ణని పరమప్రేమమునకు పూర్ణానుస్వార మను వాదమున. అందును పేరుకొనుటగూడ కాదు. పేరుకొను తలంపే భక్తియఁట. నారదశాండిల్యాదియభినవభక్తిసూత్ర

రచయితం గాంచి గుండెలు బాదుకొనవలసినదే. వీరిని సేవించి భక్తిరహస్యముల నేర్వవలసినదే.

11. సాధురతి. మూ. సద్భిస్సంగః (= సత్సంగము). సాధురతి యనిన సాధువులరతి యనియా? సాధువిషయక మగురతి యనియా? రెండును నిరుపయోగములే. రతిమాత్ర ముండిన చాలదు. సాధుసాంగత్యము నిరంతరము ఉండవల యును. అదియే కోరఁదగినది.

12. తత్త్వనిరతుండు మూ. తత్త్వకుశలః. తత్త్వమున నేర్పరి. తత్త్వనిరతుం డనిన తత్త్వమున లీనుఁడు, ప్రేముడి గలవాఁడని. నిరతశబ్దము నైపుణిని సూచించుమాట కాదు. కుశలుఁడన మార్గమును చక్కఁగ నెఱింగి యితరుల శిష్యుల నడుపఁగలవాఁడని భావము. కౌశల్యము లేని తత్త్వనిరతుం డగు గురువుండినను శిష్యుని కెట్టిసాయమును చేకూరదు. ఈతత్త్వనిరతుండు తెనుంగు 'యతీశ్వరుఁడే'.

13. 'భాస్వర బహుజన్మసాధితభవచ్చరణార్చనకుఁ.' అమూలకము భాస్వరశబ్దము. ఈ ప్రకాశించునది యర్చనయా? అర్చన భాస్వరమనిన నర్థమేమి! ఈశబ్దము కేవలము పాద పూరకము, అజాగళస్తనము.

14. సాధితభవచ్చరణార్చనకుఁ మూ. కృతాయాశ్చ రణయోః. వరివస్యాయాః (= చేయఁబడిన చరణసేవయొక్క). అర్చనను సాధించుట యననెట్లు? అర్చనచేయుట యందురే కాని యర్చనను సాధించుటకని వినియెఱుంగము. అర్చన యేదేని యోగసాధనయా?

15. ఫలాకృతుల్. మూ. ఫలమితి హి మన్యే. ఫల మని నిశ్చయముగాఁ దలంతునని రచయిత. అనువాదకులు ఫలాకృతులనిరి. ఫలములు గావా? స్పష్టముగ ఫలమేయని రచయిత 'హి' 'మన్యే' అనుపదములచే చెప్పెను.

16. సుకృతినాం! అనువాదమున లోపించినది. ఎట్టివరి వస్య చేసినను సుకృతమున్న నే ఫలప్రాప్తి యని తాత్పర్యము.

**88** 'సుకృతినాం' లోపించుట సుకృతికిని లోపమే.

## VIII

ఆ. వరనీలోత్పలదేహవై సురలఁ బ్రోవందొల్తముక్కంటికిన్
స్మరవేగమ్ము ఘటించి తాపయినిభాషామూర్తివై చున్ సుధా
స్ఫురణంబున్ గడకొత్తఁజాలితివి; యిచ్చో నేఁడుస్వర్ణాభవై
వరుసన్ జల్లనిచూడ్కి నాశ్రితులపై వర్షించె దిష్టార్థముల్.

మూ. శివాకారా నీలోత్పలసదృశ దేహా ప్రథమతః
సురాన్ భీతాన్ త్రాతుం హరమనసి మోహం జనయసి,
సుధాధారాదర్పం పరిహరసి భాషాకృతిధరా
సువర్ణాభా దీనానవసి శిశిరాపాంగనికరైః.

తా. తల్లీ! మొదట నల్లకలువఁబోని దేహము కల్గి శివాకారమున (సర్వమంగళాస్వరూపిణివై) భీతులగు సురలను రక్షింప (మన్మథునిరూపమును హరించిన) హరునిమనస్సున నే మోహమును జనియింపఁజేయుదువు. వెండియు భాషాకృతిం ధరియించి సుధాధారలదర్పమును దూరమొనర్చెదవు. తుదకు బంగరువన్నెగల లక్ష్మివై చల్లని కడకంటిచూపుల మొత్తములచే దీనులను రక్షింతువు.

ప్రా. 1. వరుసన్. య. 2. ఇచ్చో. పా. పూ. 3. ఇష్టార్థముల్. 4. నేఁడు 5 వర.

6. 'శివాకారా.' ఉమవై, శుభముంగలుగఁజేయు శివవై యని మహాలక్ష్మి మొదట నెట్లు 'త్రిధాభిన్న' యయినదియు తెల్పుచున్నాఁడు. మొదటి పరిణామము తమఃప్రధానయగు శివ. అనువాదమున నీలోత్పలదేహవై హరునికి స్మరవేగమ్ము ఘటించితి యని కలదేకాని మహాలక్ష్మియే శక్త్యుల్లాసప్రకారమున, ఏరూపమున పరిణతయై హరునిమనమును హరించెనో తెలియఁజేయలేదు. వివక్షితమగు శక్తిపరిణామమిచ్చుట లుప్తమయినది.

7. తొల్త. మూ. ప్రథమతః. తొల్త కన్వయము దేనితోడ? 'స్మరవేగమ్ము ఘటించితి' యనుదానితోడనే కదా. 'వరనీలోత్పలదేహవై' యనుదానితోడనన్న దూరాన్వయము. అదియుఁగాక తొల్త దేవి యెట్టివన్నె గల్గినదై హరునిమనస్సును హరించినదనుట ప్రధానము గాదు, ఏమూర్తి ధరించి శివునిమనస్సు చూఱఁగొనె ననుటయే ప్రధానము.

8. మూలమున లేని యశ్లీలార్థమున కనువాదమున తావు గలదు. 'తొల్త స్మరవేగమ్ము ఘటించితావయిని' అనుటచే గ్రామ్యధర్మము స్ఫురించుచున్నది. మూలమున మొదట శివాకారవైతివి. పిదప భాషాకారవైతివి యని క్రమము. అనువాదమున నైక్రమ మప్రాప్తమయినది.

9. ముక్కంటికిన్. మూ. హరమనసి. అన్నింటిని హరించు హరుని మనస్సునే మ్రుచ్చిలితివి. నీయందము గొనియాడఁదరమా. 'ముక్కంటి' యనుపదము స్వారస్యమునకు వినా

శకము. శృంగార దేవనాశ కారణమైన మూఁడవకంటిని ప్రస్తా వించు ముక్కంటిశబ్దము శృంగారకృతియందు కేవల మప్రస క్తము.

10. స్మరవేగమ్ము మూ. మోహమ్. రచయిత స్మృతి భ్రంశమును గల్గించు మోహమును, తన్నే మఱపించుదానినిఁ, గల్గించెదవని. అనువాదకులు కామోద్దీపనమును గలుగఁ జేయుదువని. స్మరవేగము మోహము గాదు,—'సంగాత్సం జాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే క్రోధాత్ భవతి సమ్మోహః......'

11. సుధాస్ఫురణంబు. మూ. సుధాధారాదర్పం. దేవి తన గౌరవర్ణముచేతను తియ్యనిపలుకులచేతను సుధాధారల గర్వమును వెలార్చినది. భాషాకృతి ధరించి దేవి సుధాధా రల మించిన యమృతంపుజాలు గురిపించినదని తాత్పర్యము. స్వారస్యమంతయు పోయిన మానెఁగాని 'దర్పమ్మ' ను పదము నకు స్ఫురణమనుట ఏటి యనువాదము? స్ఫురణమనిన నద రుట లేక తోఁచుట; దర్ప మెచ్చట! స్ఫురణ మెచ్చట!

12. వరుసన్ చల్లనిచూడ్కిన్ వర్షించె దిష్టార్థముల్. మూ. శిశిరాపాంగనికరైః. వరుస దేనియందు? రసవంతము లగుపదార్థముల మంటఁగల్పుటయందా? వరుసగా నిష్టార్థ ములు శ్రితులపై కురిపించుననియా? శ్రితులవిషయమున వరుసను పాటించుట తరతమభావములచేతఁ గావలయు. లేదేని వరుసన్ కురిపింతువనియేమో! పాపమాభక్తు లీజడికి నిలువఁ గల్గుదురా! ఇష్టార్థముల కురిపించుటయం దావరుస యేల?

13. శిశిరాపాంగనికరైః. ఆంధ్రీకరణము 'చల్లని చూడ్కిన్' అని. రచయిత చల్లని క్రీఁగంటిచూపుల మొత్తములచేతనని. శృంగారకృతిగాన క్రీఁగంటిచూపులకు స్థానముండఁగూడదని యాంధ్రీకర్తల భీష్మప్రతిజ్ఞ. క్రీఁగన్నుదారినే చూపులమొత్తములును బట్టినవి. అపాంగవీక్షణమాత్రనే దీనులు రక్షితులని లక్ష్మిమహిమ మూలమున. అంత మహిమ లక్ష్మి కొసంగిన అలక్ష్మికి కోపమనియేమో చల్లఁగ క్రీఁగంటిచూపు నవలీలగ హరించివేయుట!

14. ఆశ్రితులపై. మూ. దీనాన్ (=దీనులను). స్వర్ణాభవు కాన నసహాయులు, నిఱుపేదలు, నీదయకుఁ బాత్రులు. వారిని నీవు రక్షింపఁజాలుదానవు. దైన్యమే నీదయఁబడయుటకు వమ్ముగానిసాధనము. 'ఆశ్రయించి' నంతనే దేవి యనుగ్రహింపదు. సర్వవిధముల ధైర్యము వీడి వేఱు దిక్కుతోఁపక దైన్యముంగాంచిననే దేవి జాలిఁగొని కాపాడును. అదీనుఁడాశ్రయించుట వ్యర్థము. ఆశ్రయింపక పోయినను దైన్యమే దేవికృపను సంపాదించుటకు తొలిమెట్టు.

15 ఇష్టార్థముల్. అమూలకము. ఈయిష్టార్థములు భక్తులవనగమకమేమి? దేవి చల్లనిచూడ్కిఁ బఱపిననే యిష్టార్థము లొనఁగూడవా? దేవి పూని కురిపింపవలయునా?

16. అవసి. దీనులను రక్షింతువని రచయిత. వారికి

**104**నిష్టార్థముల నొసంగెదవని యనువాదకులతాత్పర్యము.

IX

ఆం. శ్రితులం బ్రోచు వెతల్ దొలంచి త్రిజగత్ శ్రీమాత
యంచున్ ద్రయీ, శతముల్ చాట, భవత్కృపాఘనరసే

చ్ఛాచాతకత్ బుద్ధినై, ధృతి సేవించితిఁ గాని యెన్నఁ
డును జింతింపఁగ రోఁ రాశని, ప్రతిమంబైన త్వదీయని
ష్కారుణభావంబేను సర్వేశ్వరీ!

మూ. త్రిలోక్యామేతస్యామవతి విపదో విశ్వజననీ
స్వభక్తానిత్యేతద్వదతి నిగమానాం సముదయః,
అతస్త్వత్కారుణ్యామృతఘనరసే చాతకితధీః
కదా వా నైర్ఘృణ్యాశనిభయమిదం నాస్మరమహం.

తా. విశ్వజనని తనభక్తులను ముజ్జగముల నాపదల నుండి కాపాడునని నిగమములసమూహము చెప్పుచున్నది. దానంజేసి నీకారుణ్యామృతమనెడి మేఘోదకమున చాతకముగా నొనర్పఁబడిన బుద్ధిగలవాఁడను నే నెన్నఁడును నీనైర్ఘృణ్యమనెడి పిడుగువలనిభయమును స్మరింపనైతిని.

ప్రా. 1. శతముల్. 2. ధృతి 3. ప్రతిమంబు. య. 4. శ్రీమాత 5. రసేచ్ఛా.

6. త్రిజగత్ శ్రీమాత. మూ. విశ్వజననీ. విశ్వములకు తల్లియని రచయిత. ముల్లోకములకుఁ దల్లియని యాంధ్రీకర్త.

7. వ్యాకరణముబడి 'త్రిజగత్ శ్రీమాత' యని సమాసమధ్యమున, పాదమధ్యమున విసంధి యుండనేరదు. 'త్రిజగచ్ఛ్రీమాత' యని యుండవలయును. సమాసమున సంధి నిత్యమనుటకు కారికలం గనుఁడు,-

'సంహితైకపదే నిత్యా, నిత్యా ధాతూపసర్గయోః,
నిత్యా సమాసే, వాక్యేతు సా వివక్షామపేక్షతే.'
'సంధిరేకపదే నిత్యః, నిత్యో ధాతూపసర్గయోః,
నిత్యస్సమాసే, వాక్యే తు స వివక్షామపేక్షతే' అని.

ఆంధ్రీకర్త లిట్టిప్రయోగముఁ జేసి యొక్కమాటతో వ్యాకరణనియమముల నుల్లంఘించిరి. సమాసమున సంధి పాటింపకుండుట తగదు. వీరు సమాసమధ్యంబునను సంధి వివక్షాధీన మనుకొనిరి గాబోలు. వ్యాకరణము చదివినఁ గదా, 'ప్రయోగముల నొజ్జలవలన నేర్వవలదా! ఇదియా ప్రయోగ విజ్ఞానము!' ఇంతకును నీసమాసమున కేమియర్థము? త్రిజగత్తుల లక్కమ్మ యనియా! ఇంత 'మందమ్మగు' కూర్పేల? 'శ్రిత' యతికి కపాలమోక్షము గల్గుననియా?

8. త్రయీశతముల్. మూ. నిగమానాం సముదయః. రచయిత వేదముల ప్రోవని. ఆంధ్రీకర్తలమతమున 'త్రయీ' యనిన వేదమని యర్థము. అంద తెలెంగినది త్రయి యనిన మూఁడు వేదముల సమాహారమని. 'ఋక్ సామయజుర్వేదా ఏతత్త్రితయమ్ త్రయీ' త్రివేదోక్తధర్మము త్రయీ ధర్మము. దీని నెఱుంగక వీరు 'త్రయీశతముల్' అని ప్రయోగించిరి. మూఁడు వేదముల మొత్తంపునూర్లని యర్థమా? ఇంతయు ప్రాసకై పడినపాటు. అర్థము పోయిన పోనీ, లక్షణముల నుల్లంఘించిన మానె, పద్యమున 'రన్ను'ండిన చాలునని వీరి నిర్ణయము.

9. వెతల్ దోలంచి మూ. విపదః. విపత్తనిన నాపద. వెత యనిన దుఃఖము. "వ్యథా"శబ్దభవము ఆపదలనుండి గట్టెక్క లేకపోయిన ఫలము దుఃఖము. కార్యకారణముల కభేదమనియా ?

10. భవత్కృపాఘనరసేచ్ఛా చాతకత్ బుద్ధినై మూ. భవత్కారుణ్యామృతఘనరసే చాతకితధీః. కారుణ్యామమ్మృతము. ఎవరిపై దేవి తనకృపాకటాక్షమునుఁ బరపునో యతఁడమృతత్వముం గాంచును. అందునఁజేసి దేవికృపామృతమనెడి ఘనరసమున చాతకితమైనది. నాబుద్ధి అని రచయితయాశయము. అనువాదకులకు శ్రవణసుభగత వలయునుగాని యమృత మక్కఱలేదు. కాననే వారికి దేవికి 'కారుణ్యామృత సాగర' (త్రిశతి) యనుపేరున్నదని తెలియదాయెను. 'ఘన' పదత్యాగముచేసిన 'నమృత'ము వీరికి సరిపడియుండును. రెండును కర్తకేగాని అనుకర్తకు రావు. అనువాదమున నమృత మపూర్వముగ మృతమైనది.

11. 'చాతకత్ బుద్ధి.' వ్యాకరణాభిజ్ఞత నాంధ్రీకర్త మఱలఁ బ్రదర్శించిరి. 'చాతకద్బుద్ధి'యని యుండవలయును. సమాసముగాన సంధి నిత్యము.

12. కఠోరాశనిప్రతిమంబైన త్వదీయనిష్కరుణభావంబు. మూ. నైర్ఘృణ్యాశనిభయమ్. (=నైర్ఘృణ్యము, కృప లేమి యనెడిపిడుగువలని భయము). అనువాదమున 'భయ మున కభయహస్తము. మునుంగవలసిన సరకులలో నది యొకటి. మూలమునందలిరూపకము నుపమగా మార్చినందున ననువాదమున నేమేని రసోత్కర్ష కల్గినదా? లేనిచో మూల 114మునందలి రూపకమును రూపుమాపు టేల?

X

ఆ. అలఘుప్రాభవహేతుభూతమగు నీయాలంబముఁ నమ్మి శత్రులరూపార్పవలంతినౌదునని యొందుఁ వారిపై డాయునా

వలనఁ నీవు కృపాప్రపూర్తి యిడవేఁ వ్యర్థుఁడనై పోనె దా
యలలో సేవకు నిట్లొనర్పఁ దగునమ్మా భక్తచింతామణీ!

మూ. త్వదాలంబం మత్వా హృది సకల కల్యాణనిలయం
మయా గర్వే ణాహం కథ మరి నికారాస్పద మితి
ముహు ర్నీచైః దృష్టే, పరిభవతి దుష్టే రిపుగణే,
ప్యుదాసీనా త్వం చే దహ మివ కదర్థః కథయ కః?.

తా. సకలకల్యాణనిలయమగు నీయాలంబమును నమ్ము
కొని ఎట్లు శత్రువులు నన్ను పరిభవింప నేర్తురని గర్వముతో
వారల నలక్ష్యము చేసితిని. ఇప్పుడాదుష్టశత్రువులే నన్ను పరి
భవించుచున్నారు. ఇట్టి సమయమునను నీవు నన్నొప్పరికించిన
నావలె కొఱమాలినవాఁడు మఱొకఁడుండునా? చెప్పుము.

ఆంధ్రీకర్త యభిప్రాయము,—

1. అలఘు ప్రాభవహేతుభూతమగు నీ యాలంబనమును
నమ్మితి. శత్రుల రూపార్ప వలంతినౌదునని యెంచితిని. శత్రు
లపై డాసితిని. అట్టి నావలన నీవు కృపాప్రపూర్తి యిడవు.
అట్లగుచో నేను దాయలలో వ్యర్థుఁడనైపోనా?

2. "అలఘు ప్రాభవహేతుభూతమగు"- మూ. "సకల
కల్యాణనిలయమ్." ఇట మాతృకాపుత్రికలకు మిగుల తారత
మ్యము కలదు. ఎట్లన,— భగవతి సకలకల్యాణగుణవిశిష్ట. భగ
వతికి "సకల కల్యాణగుణశాలిని"యనుపేరు త్రిశతియందున్నది.
భక్తున కామెయాలంబనముచే సకల కల్యాణగుణములు కలుగు
ననుటకు సందియము లేదు. మఱి ఆంధ్రీకర్త ఈ కల్యాణశబ్ద
మును మాని దానిస్థానమున 'ప్రాభవమును' పాదుకొల్పుట

తదనౌచిత్య పక్షపాతముచేతనే అనవలయును. ఇది యెంతయు మూలార్థభంజకము. 'కల్యాణప్రాభవము'లకు భేదమపారము. కల్యాణము శ్రేయము, మోక్షసాధనము. ప్రాభవము ప్రేయము, సంసారబంధహేతువు. సంసారము శ్రేయఃప్రేయోవ్యామిశ్రితము. అందుచే ధీరుఁడు వివేచనచేసి ప్రేయమును వదలి శ్రేయమునే గైకొనును. అట్లే శ్రుతియు,-

"శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత; స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః శ్రేయో హి ధీరోఽభిప్రేయసోవృణీతే; ప్రేయో మందో యోగక్షేమా ద్వృణీతే."— కఠోపనిషత్తు.

ఆంధ్రీకర్త పూనికచే దేవియాలంబము శ్రేయోదాయకమగుటపోయి కేవల ప్రేయోదాయకమని రాద్ధాంతితమగును. ఆంధ్రీకర్త చెప్పిన'ప్రాభవము'గూడ కల్యాణమున నేకదేశము కావచ్చును గాని ప్రాభవమున 'కల్యాణ'మంతయుఁ బట్టదు. నిగమాంతమందుఁ గృతపరిశ్రమములు ఆంధ్రీకర్తగారు ధీరులు సాధింపనెంతయు శ్రద్ధనహించు 'కల్యాణ'(=శ్రేయము)ను వదలి 'ప్రాభవము' (=ప్రేయము)నకై ఇట్లు ప్రాకులాడుట ఆశ్చర్యము కదా! ఇది "ఆంధ్రీకరణ తత్త్వము-యెఱిఁగి" చేసినదేయగునా?

(2) మఱియు, ఆ సంస్కృతభక్తునకును, ఈ తెలుఁగు భక్తునకును మిగుల తారతమ్యము కలదు. మూలభక్తుఁడు సాత్వికుఁడు. అతనిగమ్యస్థానము కల్యాణము. కల్యాణనిలయమగు దేవియాలంబమునందతనిప్రత్యయము అపారము. దానిని నమ్మికొని దుష్టరిపుగణము తన్నెట్లును పరిభవింపఁజాలదని నమ్మియుతఁడు శత్రువులను చీరికిఁగొనఁడు. ఆశత్రువుబాధింబడక దేవి

యాలంబనముచే నాత్మరక్షణము చేసికొనుటకే యతనియుద్య మము. మఱి తెలుఁగుభక్తుఁడు సాత్త్వికుఁడు కాఁడు. ఆత్మరక్షణమునకై గాక స్వప్రాభవమునకై శత్రునిబర్హణము చేయనతఁడు పూనెను. అందులకై శత్రులయాపార్పఁ దా వలంతిననుకొని వారిపై దాడివెడలును. శత్రువుల యాపార్చి నిజప్రాభవమును నెలకొల్పుకొన దేవియాలంబము నితఁడుకోరుచున్నాఁడు. ఇతని భక్తి దొంగలు, దోపిడికాండ్రు, నరహంతకులు, స్వకార్యసిద్ధికై దేవతలయందు చూపు భక్తివంటిది. తామసభక్తి. తెలుఁగుభక్తుఁడు వేషధారి, అనువాదకులు ఒండొకచో "పేరుకొనందలంపు" అని భక్తిని నిరూపించిరి. ఎంతపారమార్థిక నిర్వచన మిది! దీనిననుసరించి భక్తునికి దేవియాలంబనము కల్యాణనిలయము గాకపోవుటలో నాశ్చర్య మేమున్నది? "ఆనందనాథు నాధ్యాత్మికజ్ఞానము" వీరికే తెలియు నఁటకదా! తెలివిడికిఇది నిదానమూ?

(3) మూలమున దుష్టరిపుఁలు తన్ను పరిభవించుచుండఁగా భక్తుఁడు అమ్మా,నీయాలంబమును నమ్మి శత్రువుల నలక్ష్యము చేసితినే. నీవు కాపాడకున్న నెట్లు? అని తన దైన్యమునకు దుష్టరిపుకృతపరాభవమును కారణముగా చెప్పికొని మొఱపెట్టుచున్నాఁడు. తెలుఁగుభక్తుఁడు స్వర్థుండనై పోనె అని చెప్పికొనియున్నాఁడు. మఱి, తెలుఁగునఁ అందులకుఁ గారణము చెప్పఁబడలేదు. తాను శత్రులపై బోవుచున్నాఁడుకదా, గెలువఁడని కాని, దేవియాలంబము తనకు లేదని కాని ఎట్లేర్పడినది? "ఇట్లొనర్పఁదగునమ్మా" ఎట్లు?- ఏమి చేసినది దేవి? "కృపాప్రపూర్తి యిడవే" ఇడలేదని యేర్పడినకదా 'ఇట్లొ

నర్పవచ్చునా' అని ఉపాలంభింపవలెను? తెలుఁగులో కార్య కారణభావము జేటపడుట లేదు.

(4) "దాయలలో వ్యర్థుఁడగుట" ఏమి? దాయలలోనే యేల? ఎవరిలో వ్యర్థుఁడుగాఁడు? మూలమున "కదర్థ"అని మాత్రమే కలదు. అందుచే వీరి'దాయలు' యనెదాయలు! ప్రాసదాయలు! "ఎందుఁ వారి పైడాయు" "ఎందు" ఏమి? సర్వము ఆకాశపంచాంగముగానున్నదే! "ఆంధ్రీకరణతత్త్వ మరియు నేరని యుష్మదాదులకది యిట్టిదనుచుఁ దెలుప" నంట కదా వీరు రచియించిరి దీనిని! ఇదియేనా ఆతత్త్వము! గ్రంథ సౌరభ్యము సర్వము వీరుస్వ "పరిమళోల్లాస టీకలో" వివరింతురఁట! చూతము.

## XI

ఆ. జనకుం డద్భుత రత్నధాముఁ డనియుఁ స్థానంబు శ్రీమందిరం
బనియుఁ భర్త జగత్ప్రభుం డనియు నిన్నర్థించిన గోర్కులో
య్యనఁ జేకూరునటంచు నెంచితిని, మాయాభావయుష్మత్ప్రవ
ర్తన మొక్కింతయెఱుంగ నైతిని; మహారాజ్ఞీ శిరోరత్నమా!

మూ. నిధే స్త్వం రత్నానాం మహితతనయా సాగరపతేః;
వదాన్యానాం మాన్యా త్రిభువనవిభో ర్భాగ్యమహిషీ;
సవాసా శ్రీవాసే, త్వ మితి చ సతృష్ణోస్మి జడధీః;
మహామాయాభావో భగవతి, త వాయం న విదితః.

తా. ఓభగవతీ నీవు రత్ననిధియగు సాగరపతికి మహితతనయవనియు, వదాన్యులకును మాన్యవనియు, ముల్లోకములకు విభుఁడగుపరమేశ్వరునికి భాగ్యమహిషివనియు, సిరికి తావగు పద్మమునవివసింతువనియు, జడబుద్ధినై ఆసఁగొంటిని. కాని నీయీమహామాయాభావము నాకు తెలియదాయెను.

ప్రా 1. ప్రవర్తన. య. 2. మహారాజ్ఞీశిరోరత్నమా. 3. జనకుండద్భుతరత్నధాముఁడనియుఁ. మూ. సాగరపతేః రత్ననిధేస్త్వం మహితతనయా. మూలమున రత్నాకరుఁడగు సాగరపతి కీవు కూర్చుబిడ్డవు. అతఁడు నిన్నెంతయు గారవించు నని భావము. అనువాదకల్లోలినియందు 'సాగరపతి' 'మహిత' అనుపదములు మునింగిపోయినవి. సాగరపతియనుట లక్ష్మీదేవి కులీనతకు స్ఫోరకము. మహితతనయ యగుట ఆమెకు పుట్టినింట నెంతయేని గారవము కలదని ధ్వని. కాన తండ్రి రత్ననిధు లామెకుఁ గడుసులభములనియు అందుచే ఆమెకు భక్తపాలనదక్షతకలదనియు ఆకూతము. అనువాదకులమతమున పైరెండుపదములు సారరహితములు. తీసివేయంబడినవి. మీనాయన రత్నాకరుఁ డనియఁట. అయిననేమి అతనిపట్టి యెడ గలగారవ మెచ్చట సూచితము? తండ్రి ధనికుఁడైన కుమార్తె కది అబ్బగలదని నిశ్చయ మేమి? తండ్రి సాగరములకు పతిగాన నతఁ డెంతగ కుమార్తె నలరించుట కొసంగినను నతనిసంపద తఱుగదని ధ్వని.

"రత్నధామునిపుత్త్రిక వీవు" అనుటకును "మీతండ్రి రత్నధాముఁ డనుటకును" భేదము కలదు. మొదటిపక్షమున సాక్షాత్సంబంధము, రెండవపక్షమున పారంపర్యసంబంధము. ఇట మూలమున పుత్త్రికనే సాక్షాత్తుగ చెప్పి యుండ ఆంధ్రీకర్త తండ్రిని చెప్పినాఁడు పుత్త్రిని విధేయనుచేయుట మేలు.

5. 'వదాన్యానాం మాన్యా', ఈవిచే ఖ్యాతిం జెందిన వారికిని నీవు మాన్యవు. నీవితరణము వేఱ పొగడవలయునా? అడుగకయే యిత్తువు అని దేవి యీగి చెప్పంబడినది. అనువాదకులు "నిన్నర్థించినఁ గోర్కెలొయ్యనఁ జేకూరునటంచుఁ," అని, మూలమున వ్యంగ్యవైభవముచే ధ్వనితమైన కావ్యంపుసొంపు నధమమగు వాచ్యత నాశ్రయించి కాలరాచిరి.

6 'త్రిభువనవిభోర్భాగ్యమహిషీ, ముల్లోకముల కేలికయగువిష్ణునికి భాగ్యమహిషివి, సకలభాగ్యముల నొనఁగూర్చు పట్టపుదేవేరివి. అట్టినిన్నెవ్వరు సరిపోలఁ గలరు.

7. నీతండ్రియా కులీనుఁడు. సకలనిధులకు పెన్నిధానము. భర్తయా త్రిభువనములకుఁ బతి. నీస్వభావమన్ననో వేఱ చెప్పనక్కఱలేదు. నీవు వదాన్యులకును మాన్యవు. ఇట్లు మూలరచయిత దేవియాఢ్యతను, ఆమె స్వభావమును చెప్పి భక్తుఁడు తృష్ణను పొందుటకు తగినయుపపత్తిం జెప్పినాఁడు. కాని అనువాదకులు తమవిజ్ఞాపనమున దేవిప్రాభవమును ఆమెయుదాత్తతను క్రిందుచేయఁ దొడఁగిరి. లేనిచో త్రిభువనపతికి సంపద లొనగూర్చుపట్టపుదేవి యనుటకు నీభర్త=కూడుగుడ్డ యిచ్చి భరించువాఁడు=జగత్ప్రభుఁడని యనువాదమా? ఇచ్చట భర్తప్రభుత్వము వివక్షితము గాదు. ముల్లోకములయొడయునికి కూర్చుదేవివి. అతని

భాగ్యమువలన చిక్కినదానవు. అందును పట్టపుదేవివి అని దేవిప్రధానత వివక్షితము. అనువాదమున నీ రసమంతయు నీరసమయినది. ఎచ్చటి మూలము! ఎచ్చటి యనువాదము! అది వియచ్చరపథమున! ఇయ్యది పాతాళకుహరాంధకారమున!

8. 'మాయాఽభావయుష్మత్ప్రవర్తనము, మూ. తవ అయం మహామయాభావః. ఇందు ముఖ్యమైనపదములలో నొకటి "అయం" రెండవది 'మహా.' యనునది. అనువాదమున రెండును యథానియమము లోపింపవలసినదే. 'అయం' 'ఈ'మహామాయాభావము తెలియలేదు. ఏమహామాయా భావము అనునాకాంక్షను, పైఁజెప్పినసాగరపతిపుత్రికయగుట, వదాన్యులకు మాన్యయగుట. విష్ణునిపట్టపురాణియగుట, పద్మా లయయగుట మొదలగునవి, దూరము చేయును.అవియన్నియు మహామాయక్రీడయందుఁ దాల్చినరూపములే. వానినే పర మార్థమని నమ్మి, అవి యేపరాశక్తి యుద్భేదవికాసములో యెఱుంగక చెడుట. ఈయన్వయము అనువాదకులకు అంజన మిడుకొని చూచినను కాన్పింపలేదు. అందున నెట్టైనను చేఁబట్టినకార్యము కొనసాగించుపట్టుగాన 'అయం'ను ఎగురఁ గొట్టిరి.

9. మహామాయాభావమును— మహామాయాఽభావ ముగా నొనర్చిరి. కాని పాద మెంతమూల్గినను పూర్తిగామి 'యుష్మత్ప్రవర్తనముం జేర్చిరి.

మూలము నచ్చొత్తించినదియు ననువాదకులే. అందు లేని 'ఽ' అవగ్రహము నిచ్చుట నేల చొన్పిరి? తమతప్పును సందర్థము చేయుటకా? అక్కడ మాయాత్వము అనువాదమున మాయాభావమైనదియా! లేదేని మూలమున కిది మెఱుంగగునని యేమో. మూలమునకు ఆంధ్రీకరణమునకు భావాభావమాత్ర భేదము!

10. మహామాయను మాయఁగాఁ జేయుట యేల నయ్యా! వేదాంతులమాయయని తలంచిరి గావలయు. మహామాయ యనియే ప్రయోగించి యుండవలయును. మఱియు నీమాయాభావము తెలియనైతినని భక్తుఁడు వాపోవునపుడు నీమహామాయ తెలియనైతినే యని మాయ ఇయత్తను తెలుపు 'మహా' యనుశబ్ద మెంతయేని యుచితము. దానిని వదలుట పొరయే.

"మహామాయేతి సా ప్రోక్తా తేన సా జగదీశ్వరీ"
నమో దేవి! మహామాయే! సృష్టిసంహారకారిణి."
"మహతీ మాయా=మహామాయా."

"మహామాయా హరేశ్చైతత్ తయా సమ్మోహ్యతే జగత్".మాయాఽభావయుష్మత్ప్రవర్తనమనుటవలన-మాయ లేనినీప్రవర్తనము - అనుటచే మహామాయాభావ, అనుసమాసమును తెలిసికొనఁజాలక 'మహా' అనుదానిని తీసివైచియు 'భావ' అనుభావవాచకమును 'అభావ' అనిచేసియు ననువాదకులు స్వారస్యమును 'మహామ్మాయి' చేసిరి.

11. 'సతృష్ణోస్మి, 12. జడధీః' మునింగినసరకులలో ప్రధానములు. సతృష్ణుఁడగుట దేవిసంప్రాప్తమును నిట్లు తలంచుటంజేసి. జడధీ యగుట యామెసంవిద్రూపమును తెలియలేమింజేసి. అని రెండుపదములను రచయిత సాభిప్రాయములుగా ప్రయోగించి యున్నాఁడు. కానసే ఆంధ్రీకర్తలు వానిని విడిచిరి.

ఇట నొకసందియము గలదు. "నిన్నర్థించినఁ గోర్కెలొయ్యనఁ జేకూరునటంచు నెంచితి" ననుట "వదాన్యానాం మాన్యా" అనుదానికి అనువాదమా? లేక "సతృష్ణోఽస్మి జడధీః" అనుదానికా?

**13 "నిధేస్త్వం రత్నానామ్" అనుటకు "రత్నధాముఁడు" అనియనువాదము. నిధికి-ధాముఁడను నాంధ్రీకరణము పేలవము. పెన్నిధిని కోల్పోయి పేదయయి ధామమునఁ గూర్చుండుట ఏపాటి సరసము? అర్థమునుకలుషించుట యిదియేనా?**

14. మూ. భగవతీం. అనువాదకులు 'మహారాజ్ఞీశిరోరత్నమా?' రెంటికిని మేరుసర్షపతారతమ్యము. ఇట భగవతి యనుపదము దేవి యైశ్వర్యము యశస్సు మొదలగువానిని సూచించుటకుం బ్రయోగింపఁబడినది. అనువాదకులు మహారాజ్ఞీశిరోరత్నమా అని. పొడుగుగఁ బ్రయోగించి దేవిని నికృష్టను చేసినారు. ఎంత చక్కఁగ పాడుచేసిరి మూలమును!

**132**

## XII

ఆం. ధరణి, భవత్కటాక్షలవదర్శనమెవ్వనికిన్ క్షణార్ధమే
దొరకు నతండరాతిచయదుర్భరగర్వభరాపనోదియై
హరిపద బద్ధదృష్టియగు చాత్మరమాప్రమదమ్మునన్ బథాం
తరముగనుంగొనండు; విహితత్వము బాంధవముల్ వదల్గొనున్.

మూ. త్వదక్షిప్రక్షేపః క్షణమపి చ యస్మిన్ క్షితితలే
తదక్షిప్రత్యక్షాచ్యుతపదసమాసాదనపరం,
న జానీతే కించిన్నిజవిభవ సందర్శనముదా
సుహృద్వర్గే బంధౌ విసృజతి సమీహామహరహః.

తా. తల్లీ, నీకటాక్షపాత మెవ్వనిపై క్షణకాలమే నియు పడునో యతనిచూపు చ్యుతినెఱుంగని యపరోక్షమగు ముక్తిపదము సంపాదించుటయందు లీనమై స్వాత్మవైభవము గోచరించునానందమున నితరమును దేనినిగాని తెలియఁడు. అనుదినము సుహృద్బాంధవులపై నాసక్తిని వదలును.

ప్రా. 1. దొరకు 2. హరిపద 3. పథాంతరము. 4. దుర్భర.
పా. పూ. అరాతిచయదుర్భరగర్వభరాపనోదియై

6. కటాక్షలవదర్శనము. మూ. త్వదక్షిప్రక్షేపః మూలము. "నీకటాక్ష మెవ్వనిపై పడునో" యని. అనువాదకులు శాక్తేయసిద్ధాంతానభిజ్ఞులు గాన కటాక్షలవదర్శనమని యాంధ్రీకరించిరి. పాతమను శబ్దమిటనుచితము. శక్తిపాతము

శక్తివిక్షేపము, శక్తిప్రక్షేపము, మొదలగునవి పారిభాషిక శబ్దములు. వానిం దెలియనిచో అనువాదమునకు చేటు మూడును. శక్తిప్రవాహము, చిత్ప్రవాహమును విద్యుత్ప్రవాహమును బోలినవి. స్వాత్మ సాక్షాత్కార మగుటయే, యీశ్వరీప్రణిధానము గల్గుటయే తడవు శక్తి తన ప్రవాహమున సాధకునియంత్రమును - దేహమును - ముమ్మరించి వేయును.

'శక్తిపాతవశాద్దేహీ౦ నీయతే సద్గురుం ప్రతి' అని శాక్తేయులు శక్తిపాతమునే తడవెదరు. అట్టిపదమును ప్రక్షేపశబ్దమును విడుచుట శాక్తాగమానభిజ్ఞతకుఁ బడగనెత్తుట.

7. "అరాతిచయదుర్భరగర్వభరాపనోదిన్యై" ఇది అమూలకము సంసారనిమగ్నులకు శత్రువులవలని యాపదలు వానిం దొలంచుయత్నములుఁ నుండక మానవు. భక్తునికిని ఇట్టియాపద లుండుననుట అసంబద్ధము.

'కథమరినికారాస్పదమితి' అని రచయిత నుడివి యుండినను అది దేవి యక్షిప్రక్షేపము పడనిభక్తునివిషయము. ఏదేని గర్వముండినను దేవికటాక్షపాతము కల్గినపిదప నతని కట్టిభావ ముండనేరదు. అట్టిభక్తునివిషయమున, 'ప్రత్యక్షాచ్యుతపదసమాసాదన" పదునికి "అరాతిచయదుర్భరగర్వభరాపనోదిత్వము" కట్టిపెట్టుట గృహప్రవేశమున కేగుచు గ్రుడ్డిగూబను చంకఁబెట్టుకొనిపోవుటయే? వెండియు ననువాదకులమనస్సు

లో మాటిమాటికి అస్థానమునం గూడ నీశత్రువులు మెదలు చుండుటకు తత్వజ్ఞులు మానసికనిమిత్తముం జెప్పఁజాలు దురా?

8. హరిపదబద్ధదృష్టియగుచు మూ. ప్రత్యక్షాచ్యుత పదసమాసాదనపరం. ఆంధ్రీకరణయుంధ్యానిలంపు 'రన్ను' లో నపరోక్షానుభూతిని సూచించు ప్రత్యక్షశబ్ద మెగిరిపోయినది.

9. హరిపదము=మూ. అచ్యుతపదం=చ్యుతిలేనిపదము. శాశ్వతమగుముక్తిపదము. అది హరిపదముగాదు. షష్ఠీతత్పు రషము కాదు, కర్మధారయము. ఇట హరిపదము వైకుంఠపద వియూ, లేక భక్తుఁడాకసమును జూచుచుఁ గూర్చుండుననియూ భావము.

10 బద్ధదృష్టి యగుచు. మూ. సమాసాదనపరం. సంపా దింపఁ దొడఁగినదే కాని సంపాదింపలేదు. కాననే కడపట "అహరహః" సుహృద్బాంధవ భావముల విడుచుచుండుననుట. క్షణకాలము దేవికటాక్షపాతమయినను 'అహరహః' ఆసక్తి పోవునని. వీని నన్నింటిని వదలి యాంధ్రీకరణమున భక్తుఁడు ముక్తుఁడైనట్లే చెప్పఁబడినది.

ఇది స్వతంత్రానువాదము గావలయు!

11. ఆత్మరమాప్రమదమ్మునర్. మూ. నిజవిభవసందర్శ నముదా. స్వయంజ్యోతియగు స్వాత్మవిభవము గోచరించు

టచేఁ గల్గినయానందము ఆంధ్రమున నానందము నిరానందమై తనవిభవము వలనియానందము అని కలదు. రచయిత అనుభూతిప్రకారమును క్రమక్రమముగా వర్ణించిచెప్పుచున్నాఁడు. ముందీశ్వరీప్రణిధానము, కృపాకటాక్షపాతము, దానం జేసి "ప్రత్యక్షాచ్యుతపదసంపాదనపరత", తత్ఫలితముగ సాధకునకుఁ గల్గు స్వస్వరూపవిభవగోచరత, "అందున నానందము", ఆనందము కల్గుకొలంది హృదయగ్రంథిభేదనము. ఈసాధనాప్రకారముం దెల్పుపదములన్నియు జతనపడి యనువాదకులు వదలినందున సాధనాస్వరూపమే అదృశ్యమయినది.

12. 'పథాంతరము కనుంగొనండు,' ఇని ప్రాసజిత్తే—

సాక్షాత్కారానందమును గ్రోలుచున్న భక్తునివిషయమున వేఱుమార్గమునుపొందఁడనుట అర్థములేనిమాట మూ "న జానీతే కించిత్" అని కలదు. దానిభావము ఏమియు నెఱుంగఁడు అని. ఆత్మారాముఁ డగునని ధ్వని. మఱి యున్న సుహృద్బాంధవులవిషయముననో చెప్పవలసినదే గదా కాననే రచయిత,—

13. "సుహృద్వర్గే బంధౌ సమీహాం విసృజతి" అని. అనువాదము. "విహితత్వము వదల్కాను" అని. విహితత్వమున నేమి? మిత్రత్వమనియా! "వీఁడు నాకు విహితుఁడు" అను లోకసామాన్యప్రయోగమే వీరికిని ప్రమాణమా ? పనికి వచ్చునా?

14. బాంధవముఙ్. రచయిత బంధుగుల యందాసక్తిని వదలును అని. అనువాదకులు "బాంధవము న్వదల్కానుఙ్"




...వీరి బాంధవమున భావార్థకమా? అగుచో "బాంధవ్య ...అనవలయును ...దమర్థమున అణ్. వచ్చి బాంధవము, ...అగుననుకొని ...ము బంధువును లేక, బందుగునకు ...బంధించినది ...గును. అట్టిచో సంబంధించినది ఏది? అను ...బద్యమున మౌనమే యుత్తరము, అభినవ వ్యాకర్త భావార్థమున 'అణ్' ప్రయోగించిరి కాఁబోలు.

15 సమీహాం-ఆసక్తిని వదలునని మూలము. బంధుత్వము నే వదలునని యనువాదకులు.

16. "అహరహః" మూలమున సాక్షాత్కారానంద మబ్బుకొలఁదియు దినదినమును ఆసక్తి వదలును అని వైరాగ్య ప్రకారము చెప్పఁబడినది. శృంగారకృతియందు, 'అహరహః' లోపించినది.



## ఉపసంహారము

ప్రాయికముగ, నీయాంధ్రీకరణము మూలచ్ఛేదకము అనధికారక్రియావిలసితము. అందుచే మూలకావ్యమునందలి తాంత్రికసిద్ధాంతములు ఇందు చెడినవి. రసమును డిందువడినది. దీనిని హెచ్చరించుటకే నాయీయలఁతిసేవ. ఇది విమర్శైకదేశము. శేషమును మఱొకప్పుడు ప్రకటింతును. ఇందలి గుణాగుణములకు సహృదయులే ప్రమాణము

---

...ప్రెస్సున ముద్రితము.—1936.

# I

## సంజ్ఞా వివరణ సూచిక

| | | | |
|---|---|---|---|
| ప్రా, | ప్రా. పూ | — | ప్రాసపూరణము |
| య, | య. పూ | — | యతిపూరణము |
| పా, | పా. పూ | — | పాదపూరణము. |
| ఆ. | — | — | ఆంధ్రీకరణము. |
| మూ. | | — | మూలము. |

# II

## శోధన పత్ర లేశము.

| పుట. | పంక్తి, | ఉన్న పాఠము. | సవరణ. |
|---|---|---|---|
| అట్ట | 8 | మంజరీ | మంజరి |
| | 12 | సామ్య | స్వామ్య |
| 1 | 8 | మంజరీ | మంజరి |
| 2 | 2 | భిన్న | ఛిన్న |
| 4 | 5 | ప్రతిమాటయు | ప్రతి వాక్యమును |
| 4 | 19 | బోధనము | బోధము |
| 5 | 14 | కాదగు | కాఁదగు |
| 7 | 12 | ప్రసాధనా | ప్రసాధన |
| 9 | 8 | మహిమల | మహిమలు |
| 9 | 8 | వర్ణించి | వర్ణితములు. |
| 10 | 4 | పలతురో | పలుతురో |
| 10 | 11 | మెలకువ | మెలఁకువ |
| 11 | 8 | మంజరీ | మంజరి |
| 14 | 22 | గావలయు. | గావలయు |
| 15 | 7 | స్యేతి | స్యాఇతి |
| 15 | 9 | అరింటికి | అఱింటికి |

| | | | |
|---|---|---|---|
| 18 | 5 | కలపుపోటు | కలపుఁబోటు |
| 19 | 1 | (రసము | రసము |
| 19 | 9 | కాచి | కాఁచి |
| | 10 | సరగు | సరుఁగు |
| 20 | 18 | అనుటయా! | అనఁటయా |
| 20 | 14 | కవిహృదయము. | కవిహృదయము |
| 19 | 11 | హైమనది | హైమనవి. |
| 20 | 11 | యుంజ్నాము | యుంజ్నాగము. |
| 24 | 28 | సద్వృత్తైః | సద్వృత్తైక్ |
| 82 | 10 | తాత్పర్యః | తాత్పర్యమ్. |
| 83 | 20 | ముదుసలి | తేపుఁగు ముదుసలి |
| 84 | 1 | చంచలతు | చంచలను |
| | 1 | ముదుసలిని | ముదుసలికి |
| 46 | 20 | కురుపించు | కురిపించు |
| 48 | 24 | నిత్యః | నిత్యో |
| 49 | 18 | త్రివేదోక్త | త్రివేద్యుక్త |
| 50 | 12 | వ్యాకరణాభిజ్ఞత | వ్యాకరణానభిజ్ఞత |
| 56 | 21 | ఒడయని | ఒడయనికి |
| 57 | 6 | మయా | మాయా |
| 62 | 2 | తత్వ | తత్త్వ |

విరామ చిహ్నములయందు కొన్ని పొరలు కలవు.

## 51, 52, 53, 54 పుటలును శోధన పత్రమును

జమీన్ రైతు ప్రెస్సున ముద్రితము, నెల్లూరు.